# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసి, ఆలోచించి, టక్కున అంటించాలి యింక, సరదాగా యిది చెయ్యాలింక"



ఫెవీ ఫెయిరీ

"ఇంద్రజాలం కానే కాదిది
చేస్తేచేసే తమాషా యిది
డబ్బాలోనూ పనివేం లేదు
దీనికి యిక మరి ఎదురేలేదు."
"ఏమిటిదంతా విప్పి చెప్పు
ఏంచెయ్యాలో నవ్వున చెప్పు."
"చంద్రా ఓ బుట్టి చంద్రా
చెప్పేదేదో వినిపొందద్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యచ్చు
పట్టుకోనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మైనా చేసెయ్యండి"

ఆలీ బొల్ (గుడ్లగూబ) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం యీ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి: "ఫెవి ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

ఆలీ బొల్ (గుడ్లగూబ) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం కూపన్‌ని "ఫెవి ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020 చిరునామాకు పోస్టు చెయ్యండి.



పేరు ________________

వయసు ________________

చిరునామా ________________

నగరం ________________

రాష్ట్రం ____________ పిన్ ________

మీకు మా ఉచిత 'ఫెవి క్రాఫ్ట్' అందిందా? అవును/కాదు (C)

## ఫెవికాల్® ఎమ్ ఆర్

సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**



OBM 3402 TL

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్ రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ముక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పోస్ట్ బాక్స్ నం. 11501, నారిమన్ పాయింట్ పోస్ట్ ఆఫీస్, బొంబాయి 400 021.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:........................................................................ Age:....................

Address:..............................................................................................

..........................................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 31.8.1984

**CONTEST NO37**

Vision/CPL B4058 Tel.



# చందమామ

అగస్టు 1984



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-00

సంవత్సర చందా: 24-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''రాజు నిర్ణయం''] కు ఆధారం, ''వసుంధర'' రచన.

ఒక మనిషి తెలివితేటల్నీ, వివేకాన్నీ, ఇంగిత జ్ఞానాన్నీ, అతడు ఎదుర్కొన్న సమస్యలను పరిష్కరించిన తీరునుబట్టి అంచనా కట్టవచ్చు. ఇది చిన్నా-పెద్ద అన్న తారతమ్యం లేకుండా అన్ని సమస్యలకూ వర్తిస్తుంది. ''వర్తకుడి పరీక్ష'' అన్న కథలో, యీ సత్యం చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

ప్రాజ్ఞస్తు లభతే జ్ఞానం, న జడో గురు బోధనాత్,
ముకురే దృశ్యతే బింబం, న కదాపి మృదాం చయే.

[గురువు బోధించేదాన్ని, బుద్ధివంతుడైనవాడు గ్రహించి జ్ఞానం పొందగలడు. మూర్ఖుడికి అది సాధ్యపడదు. మన ప్రతిబింబం అద్దంలో కనబడుతుందే గాని, మట్టిముద్దలో కాదు గదా!]

సంపుటి 75 అగస్టు '84 సంచిక 2

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## రెక్కల ఓడలు

అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయానికి చెందినవారు, ఇటీవల ఒక రెక్కల ఓడను రూపొందించారు. నీళ్ళపై చేపలా రెక్కలల్లాడిస్తూ సాఫీగా ముందుకు సాగుతుంది ఓడ.

## కంఠస్వరంతో రోగనిదానం!

నాడిని పట్టిచూసి రోగనిదానం చేయడం మన దేశంలో చాలా కాలంగా వున్నది. ఇప్పుడు సోవియట్ రష్యాకు చెందిన కొందరు పరిశోధకులు — ఒక వ్యక్తి కంఠస్వర లక్షణాలను పరిశీలించి, ఆ వ్యక్తి ఆరోగ్యస్థితిని తెలుసుకునే నూతన విధానాన్ని కనుగొన్నారు.





## వీడియో క్రీడలు తెచ్చే ప్రమాదం

రోజురోజుకూ ఉధృతమైపోతూన్న వీడియో గేమ్స్‌వల్ల — అనేక శారీరక, మానసికరోగాలు వస్తాయని పరిశోధకుల దృష్టికి వచ్చింది. ఈ వీడియో క్రీడలు చాలామందికి చిత్తభ్రమను కల్గించడమే కాకుండా కొందరికి మూర్ఛవ్యాధిని తెచ్చే అపాయం కూడా వుందని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

## మీకు తెలుసా?

1. భారత దేశంలో ఎత్తైన జలపాతం ఏది?
2. హిమాలయాల పాదతలంలో కొండల మధ్య వెలసే హిందువుల పవిత్రక్షేత్రం ఏదో మీకు తెలుసా?
3. అహ్మదాబాదు నానుకుని ప్రవహించే నది ఏదో మీకు తెలుసా?
4. మన దేశంలో వైశాల్యంలో పెద్దదైన రాష్ట్రం ఏదో మీకు తెలుసా?
5. మన దేశంలో విక్టోరియా స్మారక — ప్రదర్శనశాల ఎక్కడ వున్నదో మీకుతెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)



# సాంబయ్య కథ

సాంబయ్యకు కథలు చెప్పడమంటే చాలా సరదా. ఆయన మనమడు రాజుకు ఆటలంటేనే ఆసక్తి. పొద్దస్తమానం ఆటలేమిటిరా అని, సాంబయ్య తిట్టినాసరే, వాడు బయటికి పారిపోయి ఆడుకోవాలనే చూసేవాడు. ఒక్కొక్కసారి సాంబయ్య మనమడిని గట్టిగా పట్టుకుని కూర్చోబెట్టి, కథలు చెబుతూండేవాడు. ఆయన కాస్త పట్టు సడలిస్తేచాలు, వాడు అక్కడి నుంచి పారిపోయేవాడు.

మనమడికి కథలంటే ఆసక్తి కలిగించేందుకు సాంబయ్య ఎన్నో ప్రయత్నాలు చేశాడు. వాడికోసం ఆయన తనవద్ద మిఠాయిలూ, ఇతర తినుబండారాలూ దాచి వుంచేవాడు.

రాజు మాత్రం సాంబయ్య కథ పేరు చెబితేచాలు; హడిలిపోయి అక్కడి నుంచి పారిపోయేవాడు.

సాంబయ్యకు మనమడి బాధ ఏమిటో అర్థం కాక, ఇంట్లో భార్యనూ, కొడుకునూ, కోడలినీ, "నేను కథలు చెబుతూంటే విసుగ్గా కానీ వుంటుందా?" అని వాళ్లకు విడివిడిగా కథలు చెప్పేవాడు.

పెద్దవాళ్ళకు కథలు వినాలనిపించదు కదా! అయినా వాళ్ళు మొహమాటానికి, "నీ కథలకేం? కళ్ళకు కట్టినట్టు చెబుతావు! మాకే వినాలనిపిస్తుంది. ఆ రాజు వెధవకు ఎందుకు నచ్చవో ఏమో!" అనేవారు.

సాంబయ్య అది అలుసుగా తీసుకుని, "అయితే, మీరైనా నా కథలు వినండి. మీ పనులకు యిబ్బంది లేకుండా, నేను కథలు చెబుతాను," అనేవాడు.

ఆ విధంగా ఆయన వత్తులు చేసుకుంటున్నప్పుడు భార్యకూ, వంట చేస్తున్నప్పుడు కోడలికీ, పెరట్లో కూరపాదులకు

జొన్నలగడ్డ రామలక్ష్మి



నీళ్ళు పోస్తున్నప్పుడు కొడుకుకూ కథలు చెబుతూండేవాడు.

వాళ్ళకిది చాలా విసుగ్గా వుండేది. ఈ చిక్కు నుంచి బయటపడేందుకు వాళ్ళు రాజును పట్టుకుని సాంబయ్యకు అప్పగించి, కథలబారి నుంచి మెల్లగా తప్పించుకునేవాళ్ళు.

ఇలా కొన్నాళ్ళు జరిగాక రాజు, తాతయ్యతో మాట్లాడి ఒక సంధి ఒప్పందానికి వచ్చాడు. దాని ప్రకారం వాడు, తాత దగ్గిర నుంచి రోజుకు ఒకేఒక్క కథ మాత్రం వింటాడు. ఆ కథ అయిపోగానే, తాత వాడిని ఆడుకునేందుకు వదిలి పెట్టాలి.

సాంబయ్య యిందుకు ఒప్పుకున్నప్పటికీ, తన తెలివితేటలతో మనమణ్ణి మోసం చేసేవాడు. ఒక్కొక్కసారి చాలా పెద్ద కథ చెప్పేవాడు. అది ఎప్పటికీ ముగింపుకు రాక రాజుకు ఏడుపు కూడా వచ్చేది. మరొకసారి నాలుగైదు చిన్న కథలను, ఒకదాని తర్వాత ఒకటి కలుపుకుంటూపోయి, ఒకే కథలా చెప్పేవాడు. ఇందువల్ల, రాజు ఆడుకునేందుకు వెళ్ళాలంటే, తాతయ్య చెప్పే కథ పూర్తిగా వినవలసి వచ్చేది.

ఇలా వుండగా, ఆ ఊరికొక కొత్త కుర్రాడు వచ్చాడు. రాజుకు వాడు చాలా నచ్చాడు. కాని, రాజు రోజూ వాడితో ఆడుకునేందుకు ఆలస్యంగా వెళ్ళేవాడు.

"కాస్త పెందరాళే రాకూడదా, ఎక్కువసేపు ఆడుకోవచ్చు," అన్నాడు కొత్త కుర్రాడు.

అప్పుడు రాజు, వాడికి తన తాత కథల బాధ చెప్పుకున్నాడు.

"ఏమిటీ, మీ తాత కథలు చెబుతాడా? కథలంటే నాకు చాలా యిష్టం," అన్నాడు కొత్త కుర్రాడు.

"అయితే, నువ్వు వెళ్ళి, మా తాత కథలు వినకూడదూ? నేను మరెవరితోనైనా ఆడుకుంటాను," అన్నాడు రాజు ఆశగా.

"అలాగే చేస్తాను. మా ఇంట్లో ఎవరి నడిగినా కథలు చెప్పరు." అన్నాడు కొత్త కుర్రాడు.

మర్నాడు రాజు, కొత్త కుర్రాణ్ణి సాంబయ్యకు పరిచయం చేసి, "తాతయ్యా, వీడికి కథలంటే చాలా యిష్టం. ఇక నుంచీ రోజూ, నా బదులు వీడు కథలు వింటాడు," అన్నాడు.

సాంబయ్య చాలా ఆనందపడి, రాజును వదిలివేసి, కొత్త కుర్రాడికి ఒక కథ చెప్పాడు. కథలో ఒక రాజకుమారుడూ, మరొక దేశం రాజకుమార్తే వున్నారు. రాజకుమార్తెను ఒక భయంకర మాంత్రికుడు ఎత్తుకుపోయాడు. రాజకుమారుడు ఎన్నో ఏళ్ళు కష్టపడి, అద్భుతమైన విద్యలు నేర్చుకుని మాంత్రికుణ్ణి చంపి, రాజకుమార్తెను వివాహమాడతాడు.

కథ విని కొత్తకుర్రాడు, సాంబయ్యను, "ఆ తర్వాత మరే దేశాల్లోనూ మాంత్రికులు రాజకుమార్తెలను ఎత్తుకుపోలేదా?" అని అడిగాడు.

"ఎత్తుకుపోతే మనకెందుకు?" అన్నాడు సాంబయ్య నవ్వుతూ.

"ఎందుకంటే—మన రాజకుమారుడు మంచివాడు, పరోపకారి, ఎన్నో విద్యలు తెలిసినవాడు. అలాంటివాడు రాజకుమార్తెను పెళ్ళాడాను గదా అని, ఊరికే



కూర్చోడు గదా! ఇంకెవరైనా కష్టాల్లో వుంటే, సాయపడడానికి వెళతాడు, అవునా?" అని అడిగాడు కొత్త కుర్రాడు.

ఇది వింటూనే సాంబయ్యకు చాలా ఉత్సాహం కలిగింది. "అవునవును, చాలా బాగా అడిగావు!" అని ఒక్క క్షణం ఆగి, "అప్పుడు ప్లవంగ రాజ్యంలో మాంత్రికుడొకడు విజృంభించి, నూరుమంది రాజకుమారులనూ, నూటొక్క రాజకుమార్తెలనూ దేవికి బలియివ్వాలనుకున్నాడు...." అంటూ కథ ప్రారంభించి, ఈ మాంత్రికుణ్ణి మొదటి రాజకుమారుడే చంపి, తన దేశానికి చాలాకాలం తర్వాత తిరిగి వెళ్ళాడని ముగించాడు.

కొత్త కుర్రాడు తల అడ్డంగా తిప్పుతూ, ''అయితే, తాతయ్యా! ఇంత కాలమూ మన రాజకుమార్తె తన రాజ్యంలో వూరికే వుండిపోదుకదా? రాజ్యాన్ని మంత్రులకు అప్పచెప్పి, తన భర్తను వెతుక్కుంటూ బయలుదేరుతుంది. రాజకుమార్తె ఇల్లు కదిలితే అన్నీ కష్టాలేకదా!'' అన్నాడు.

సాంబయ్య మళ్ళీ కథ మొదలు పెట్టాడు. అయితే, ఆయన ఎంత చెప్పినా, కొత్త కుర్రాడికి ఏవో అనుమానాలు వస్తూనే వున్నవి. అందువల్ల సాంబయ్య కథకు ముగింపు అంటూ రావడం లేదు.

ఇలా కొంతసేపు జరిగేసరికి సాంబయ్య అలిసిపోయి, ''మిగతా కథ రేపు చెబుతాలే!'' అన్నాడు.

''రేపటిదాకా ఆగడమే! నాకిప్పుడే కథ కావాలి,'' అన్నాడు కొత్త కుర్రాడు.

సాంబయ్య గట్టిగా గాలి పీల్చుకుని, ''అబ్బాయ్, లోపలికి వెళ్ళి కాసిని మంచి నీళ్ళు తెచ్చిపెట్టు. దాహం తీర్చుకుని కథ పూర్తిచేస్తాను,'' అన్నాడు.

కొత్త కుర్రాడు లోపలకు వెళ్ళగానే, సాంబయ్య ఇంట్లోంచి వీధిలోకి వచ్చి పరిగెత్తసాగాడు. దారిలో ఎదురుపడి అడిగినవాళ్ళకు, తన మనమడి కోసం పోతున్నట్టు చెప్పసాగాడు. తాతయ్య తన కోసం వస్తున్నాడని భయపడి రాజు ఒక పట్టాన ఆయనకు దొరకలేదు. ఎవరో పట్టుకుని ఆయనకు అప్పజెప్పారు.

సాంబయ్య రొప్పుతూ మనమడితో, ''నాయనా, రాజూ! భయపడకు. నేను, నీకు కథలు చెప్పడానికి రాలేదు. ఇందాక నువ్వు తీసుకువచ్చిన, ఆ కొత్త కుర్రాణ్ణి మనింటికి రాకుండా చూశావంటే, నీకు మరెన్నడూ కథలు చెప్పను,'' అన్నాడు.

తాతయ్యలో హఠాత్తుగా యిలాంటి మార్పు ఎందుకు వచ్చిందో అర్థంకాక పోయినా, రాజు సంతోషంగా సరేనన్నాడు.

ఆ తర్వాత సాంబయ్య ఎవ్వరికీ కథలు చెప్పలేదు. బలవంతంగా ఎవరిచేతనైనా, ఇష్టం లేని పని చేయించడంలోని కష్టం, ఆయనకు అప్పటికి తెలిసివచ్చింది.






## 16

[హసన్‌గోరీతో కలిసి, పింగళుడు ఇఫీఖిల్లా కోట తలుపులు తెరవబోయేసరికి, ఎడారి దొంగలు వాటి వెనక పెట్టిన మాటు పేలి, కొందరు సైనికులు గాయపడ్డారు. తరవాత ఎడారి దొంగ రాబందు, వాళ్ళకు కొండలలో కనిపించాడు. అక్కడ భయంకరమైన పోరు జరిగింది. అదే సమయంలో పింగళుడికి హఠాత్తుగా మాంత్రికుడైన పద్మపాదుడు కనిపించాడు. తరవాత —]

మహా మాంత్రికుడైన పద్మపాదుణ్ణి, తిరిగి తను జన్మలో చూడగలనని పింగళుడు ఏనాడూ భావించలేదు. అలాంటి స్థితిలో పద్మపాదుడు, హఠాత్తుగా కనిపించటమే గాక, అదీ....అవంతీ నగర రాజ్య భూములకు ఎడంగా ఎక్కడో వేలమైళ్ళ దూరాన వున్న ఎడారి కొండలలో అవటం; పింగళుణ్ణి ఎంతో ఆశ్చర్యపరిచింది. కాని, మరుక్షణం లోనే అతడి ఆశ్చర్యం అనుమానంగా మారటంతో, అతడు తన పక్కనే వున్న హసన్‌గోరీ కేసి చూశాడు.

హసన్‌గోరీ ముఖంలో కూడా అనుమానం, సంశయం తొణికిసలాడుతున్నవి. అతడు పింగళుడి భుజం పట్టుకుని దగ్గిరకు లాగుతూ, "పింగళా! ఎవరీ పద్మపాదుడు? ఎడారి దొంగ రాబందు యితడే కాదుగదా?" అన్నాడు రహస్యంగా.



పింగళుడు ఏదో చెప్పబోయేంతలో పద్మపాదుడు వారిని సమీపించాడు. అతడు హసన్‌గోరీ కేసి వేలు చూపుతూ, "పింగళా! ఎవరీతడు?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో పింగళుడు మరీ తికమక పడిపోయాడు. అతడి తడబాటును గుర్తించిన పద్మపాదుడు, అందుకు కారణం ఏమిటో గ్రహించినట్లు చిరునవ్వు నవ్వుతూ, "పింగళా! నీవు నన్ను గురించి ఏదో అనుమానిస్తున్నట్టున్నది, అవునా?" అని ప్రశ్నించాడు.

పింగళుడికి ఏమని జవాబు చెప్పాలో తెలియలేదు. అతడి దృష్టి, పద్మపాదుడి మీదినుంచి హసన్‌గోరీ కేసి తిరిగింది; దానితో హసన్‌గోరీ పద్మపాదుడి కేసి ఒక అడుగు ముందుకువేసి, "అయ్యా, మీరెవరో నాకు తెలియదు. కాని...." అంటూ ఆగాడు. హసన్‌గోరీ మాటలకు పద్మపాదుడు బిగ్గరగా నవ్వాడు.

అతడు పింగళుడిని సమీపించి, అతడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "పింగళా! ఇప్పుడు, యీ కొండ ప్రాంతాల నుంచి పారిపోయిన ఎడారి దొంగలకు నాయకుణ్ణి నేనే అని మీ యిద్దరూ అనుమానించటం లేదుగదా?" అని అడిగాడు.

"లేదు, పద్మపాదా!" అంటూ పింగళుడు, హసన్‌గోరీని చూపుతూ, "ఈయన నవాబుగారి ఒంటెల పటాలం నాయకుడు, పేరు హసన్‌గోరీ. రాబందు అనబడే ఎడారి దొంగకోసం, యీయన యీ ప్రాంతాలన్నీ గాలిస్తున్నాడు," అన్నాడు.

పద్మపాదుడు ఆ మాటలు వింటూనే, హసన్‌గోరీ కేసి తిరిగి, "అయ్యా, మీరు ఎడారి రక్షకభటనాయకులైతే, మీరు కాపాడవలసిన కొందరు వర్తకులు, ఆ కనబడే గుహలో బంధింపబడి వున్నారు. వారికి సాయంచేయండి," అన్నాడు.

హసన్‌గోరీకి పద్మపాదుడి మీద యింకా నమ్మకం కలగలేదు. అది గ్రహించిన పింగళుడు అతడితో, "హసన్, మీరు యీ పద్మపాదుణ్ణి నా దగ్గర వదలండి.

మీరేమీ భయపడవలసింది లేదు. ఈయన్నుంచి సర్వం నేను తెలుసుకుంటాను. ఒకవేళ యీయనే దొంగల నాయకుడైన రాబందు అయితే, మీకు కాళ్ళూ, చేతులూ కట్టి ఒప్పగించగలను,'' అన్నాడు.

పింగళుడి మాటలు, హసన్‌గోరీలో వున్న అనుమానాల నన్నిటినీ పటాపంచలు చేసినై. అతడు కొందరు సైనికులను వెంటబెట్టుకుని, పద్మపాదుడు చూపిన కొండగుహ కేసి బయలుదేరి వెళ్ళాడు.

''పింగళా! యీ దేశంకాని దేశంలోని ఎడారి ప్రాంతపు కొండల్లో నిన్ను యీ విధంగా కలుసుకోవటం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది. అవంతీనగరంలోని నీ స్వగృహాన్ని వదిలి, యింత దూరం ఏ కారణంచేత రావటం సంభవించింది?'' అని ప్రశ్నించాడు పద్మపాదుడు.

''పద్మపాదా! నాది చాలా దీనాతిదీనమైన కథ. మీరిచ్చిన మహత్తు గల సంచీనీ, ధనరాసులనూ, ఆఖరికి అన్నిటా సహాయపడుతూండే భల్లూకకేతుణ్ణి కూడా కోల్పోయాను. ఈ బాధలన్నిటికీ మూల కారణం, దుర్మార్గులూ, కుచ్ఛితులూ అయిన నా అన్నలు. మీ నుంచి సెలవు తీసుకుని, నా స్వగృహం చేరినప్పటి



నుంచి యీనాటివరకూ, నేను అనుభవించిన యాతనలను గురించి చెప్పాలంటే చాలా కాలం పడుతుంది. ముందుగా మీరీ ప్రాంతాలకు ఏ కారణం వల్ల వచ్చారో చెప్పండి. మరో మాంత్రికుణ్ణి జయించటానికి వచ్చివుంటే, నేను మరోసారి మీకు సాయపడగలను,'' అన్నాడు పింగళుడు ఉత్సాహంగా.

పింగళుడు అన్న ఆఖరిమాటలు పద్మపాదుడికి సంతోషం కలిగించినా, ప్రారంభంలో అతడు తన ధనాన్నీ, మహత్తు గల సంచీనీ పోగొట్టుకున్నట్టు చెప్పిన విషయం మాత్రం అతడికి చాలా విచారం కలిగించింది. భల్లూక పర్వతాల దగ్గిర




మహామాయుణ్ణి జయించటంలో పింగళుడు తనకు చేసిన గొప్ప సహాయాన్ని పద్మపాదుడు యీనాటివరకూ మరిచి పోలేదు.

''పింగళా! నేను మరే మాంత్రికుణ్ణి జయించేందుకూ యీ ప్రాంతాలకు రాలేదు. మహామాయుడి సమాధి నుంచి మనం సంపాయించిన అపూర్వ శక్తులు గల వస్తువులు నా దగ్గిర వున్నంత కాలం, నేను యీ లోకంలో ఎవరిని చూసీ భయ పడనవసరం లేదు. నేను కేవలం దేశాలు చూసేందుకూ, యాత్రాస్థలాలను సందర్శిం చేందుకూ బయలుదేరాను. ఆ కారణం వల్ల, నేను మామూలు యాత్రికుడి వేషంలో, ఒకానొక బిడారు వర్తకులతో కలిసి యీ ప్రాంతాలకు చేరాను. ఈ సాయంకాలమే ఆ బిడారు మీద కొందరు దొంగలు దాడిచేసి, విలువగల సామాను లన్నీ దొంగిలించి, వర్తకులనందరినీ, ఆ కనబడే గుహలో బంధించారు. వారిలో కొందరు అవంతీ నగరవాసులు వున్నారు.'' అన్నాడు పద్మపాదుడు.

ఆ మాటలు వింటూనే పింగళుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

అతడు పద్మపాదుడి ముఖంలోకి అను మానంగా చూస్తూ, ''పద్మపాదా! మహా మాంత్రికులైన మీరుండి కూడా, క్రూరు లైన ఆ ఎడారి దొంగలు వర్తకులను దోచు కుంటూ వుంటే చూస్తూ ఎలా వూరుకో గలిగారు?'' అని అడిగాడు.

పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. ''పింగళా! నేను ఆ బిడారు వర్తకుల గుంపు వెంట బయలుదేరినప్పుడు, యాత్రికుణ్ణని మాత్రమే చెప్పాను. అలా కాక, నేను ఫలానా మాంత్రికుణ్ణని చెప్పి వుంటే, వాళ్ళెవరూ నన్ను బిడారు వెంట రానిచ్చేవారుకారు. ఆ కారణం వల్లనే ఎడారి దొంగలు వారిని దోచుకుంటున్నా, నేనెవరో బయటపడకుండా వుండేందుకు గాను, నా మంత్ర తంత్రాలను, ఆ దొంగల మీద ప్రయోగించకుండా, 'యీ రాళ్ళ

చాటుకు మెల్లగా తప్పుకున్నాను," అన్నాడు.

"మీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది, పద్మపాదా!" అన్నాడు పింగళుడు. "మీవద్ద వున్న అద్భుత వస్తువులైన భూగోళం, ఉంగరం, వజ్రాలు తాపినపిడి గల కత్తి—వీటిలో ఏ ఒక్క దాని సాయంతో అయినా, మీరు చూడ వలసిన స్థలాలన్నీ ఇట్టే చూసి రావచ్చును గదా? అలాంటప్పుడు మార్గశ్రమల కన్నిటికీ ఓర్చి, యీ వర్తకుల వెంట బయలుదేరట మెందుకు?" అన్నాడు.



"ఓహో, పింగళా! నేనా దొంగల నాయకుడైన రాబందునని, యింకా నీవు అనుమానించటం లేదుగదా?" అంటూ పద్మపాదుడు పింగళుడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసి, "దేశ దేశాలు తిరుగుతూ, ఆయా చోటుల వున్న పుణ్య క్షేత్రాలను దర్శించి, ఆ ఫలం అనుభ వించాలంటే, అందరితోపాటు నేనూ పాదచారిగానే వెళ్ళవలసి ఉంటుంది. అంతేకాని నా దగ్గిర వున్న అద్భుతశక్తుల సాయంతో, అనుకున్న చోటుకు చేరటం వల్ల యాత్రాఫలం దక్కదు." అన్నాడు.

• వీళ్ళిలా మాట్లాడుతూండగా, అల్లంత దూరాన హసన్‌గోరీ సైనికుల కేకలతో పాటు బిడారు వర్తకుల ఏడుపులూ, పెడ బొబ్బలూ, కలిసి చెవులు చిల్లులు పడేలా- రణగొణ ధ్వని సాగటంతో ఆ ప్రాంత మంతా గందరగోళంగా తయారైంది. పింగళుడూ, పద్మపాదుడూ తమ సంభా షణ ఆపి, అటుకేసి తలలు తిప్పారు. అదే సమయంలో ఒక సైనికుడు పరిగెత్తుతూ పింగళుడి దగ్గిరకు వచ్చి, "రాబందును వెంటబడి పట్టుకునేందుకు, హసన్‌గోరీ సర్దార్, మీ సాయం కావా లంటున్నాడు!" అని చెప్పాడు.

పింగళుడు, పద్మపాదుడికేసి బ్రతి మాలుతున్నట్టు చూసి, "పద్మపాదా! యీ హసన్‌గోరీ నన్ను, యీ ఎడారిలో దాహానికీ, ఆకలికీ మాడి చావకుండా

రక్షించాడు. నేను యిందుకు ప్రతిగా ఆయనకు ఏదైనా సహాయం చేయాలను కుంటున్నాను. ఈ చీకట్లో, ఆ ఎడారి దొంగలను పట్టుకోవటం మానవ మాత్రుడి వల్ల అయే పని కాదు. ఆ ఎడారి దొంగలూ, వారి నాయకుడైన రాబందూ బహు క్రూరులు. ఈ దగ్గిరలో వున్న ఒక ఖిల్లాలోని సైనికులందరినీ హత్యచేసి, కపటోపాయంతో మమ్మల్ని కూడా చంపేం దుకు వాళ్ళు ప్రయత్నించారు. కనుక, యీ ఎడారి దొంగలను పట్టుకునే ప్రయత్నంలో మీరు, మీ అద్భుతశక్తులను ప్రయోగించి మాకు సాయపడండి. ఆ విధంగా, యీ ప్రాంతాల ప్రయాణించే వర్తకులకూ, యాత్రికులకూ ఆ ఎడారి దొంగల నుంచి రక్షణ కల్పించండి! మీ మేలు వారెన్నటికీ మరిచిపోరు." అన్నాడు.

"పింగళా! నీవు కోరుతున్నావు గనక సాయం చేస్తాను. కాని, అందువల్ల నేను మాంత్రికుణ్ణని, ఆ వర్తకులందరూ గ్రహిస్తారు. ఆ తరవాత వారితో నేను ప్రయాణించటం అసంభవం. సరే, యాత్రాస్థలాలు దర్శించేందుకు ఎన్ని మార్గాలు లేవు!" అంటూ పద్మపాదుడు, ఒక రాయిని తీసుకుని, దానిని తన కత్తితో చిన్న చిన్న ముక్కలుగా నరక సాగాడు.

పద్మపాదుడు చేస్తున్న పని చూసి పింగళుడు చాలా అబ్బురపాటు చెందాడు.



అతడు పద్మపాదుడి భుజం పట్టుకుంటూ, "పద్మపాదా, మీరు ఇప్పుడు చేస్తున్న పని ఏమిటి? అవతల ఎడారి దొంగలు, వర్తకుల సొమ్ము దోచుకుని దూరంగా పారిపోతున్నారు గదా! ముందు, వాళ్ళను హతమార్చే ఉపాయం ఆలోచించండి!" అన్నాడు.

పద్మపాదుడు నవ్వుతూ, తన గుప్పెట లోకి కొన్ని రాతి ముక్కలను తీసుకుని, వాటిని పింగళుడికి చూపుతూ, "ఈ చీకటిలో, ఆ దొంగలను వెన్నాడటం మానవమాత్రుడికి సాధ్యం కాదని నువ్వే చెపుతున్నావు గదా? అందుకని, చీకటిలో చూడగలిగిన తోడేళ్ళనూ, పెద్ద పులులనూ ఆ దొంగలను మళ్ళించుకు వచ్చేందుకు పంపుతున్నాను. యీ అరచేతిలో వున్న పెద్ద రాతిముక్కలు పులులు, చిన్నవి తోడేళ్ళు!" అంటూ ఆ రాతి ముక్కలను మంత్రించి, బలంకొందికి వాటిని చీకట్లో అన్నివైపులకూ వెదజల్లాడు.

చూస్తూండగానే ఆ కొండ రాళ్ళల్లో నుంచి భీకరంగా అరుస్తున్న తోడేళ్ళూ, పెద్దపులులూ బయటికి వచ్చి, రాతి బండల మీది నుంచి కుప్పించి దూకుతూ అతి వేగంగా అన్ని వైపులకూ పరుగులు తీసినై.

ఈ అద్భుత దృశ్యం చూసి పింగళుడు నిశ్చేష్టు డయ్యాడు. అతడు చూస్తూండ గానే, కొండ గుహ నుంచి హసన్‌గోరీ విడిపించిన వర్తకులందరూ గుంపుగా



బయలుదేరి పద్మపాదుడు వున్న చోటుకు వచ్చారు. వారి వెంట వున్న హసన్‌గోరీ చేతులను గాలిలో అల్లలాడిస్తూ, ''పింగళా! ఏమిటీ వింత? ఈ కొండ ప్రాంతాల నేనెన్నడూ ఒక్క తోడేలును గాని, ఒక్కగానొక్క పెద్దపులిని గాని చూసినది లేదు. కాని, యిప్పుడు....'' అంటూ కళ్ళింత చేసుకుని పింగళుడి కేసి చూస్తూ ఆగిపోయాడు.

''పద్మపాదా! ఇక మీ గురించిన రహస్యం దాచి లాభం లేదు గనక, వీరందరికీ నిజం చెప్పమంటారా?'' అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు అంగీకారసూచకంగా తల వూపి, తన దుస్తుల్లో భద్రంగా దాచి వుంచిన మహామాయుడి వేలి వుంగరాన్ని బయటికి తీసి, అక్కడ ఎత్తుగా వున్న ఒక కొండరాతి మీద పెట్టాడు. మరుక్షణమే ఆ ప్రదేశమంతా కండ్లు మిరుమిట్లు కొలిపే కాంతితో, పట్టపగటిలా అయిపోయింది.

పింగళుడు ఒకటి రెండు మాటల్లో పద్మపాదుడు మహామంత్రవేత్త అని అక్కడ చేరినవారందరికీ చెప్పి, హసన్ గోరీ కేసి తిరిగి, ''హసన్! ఆ ఎడారి దొంగ రాబందును గురించి నీవేమీ ఆదుర్దాపడ నవసరం లేదు. పద్మపాదుడు పంపిన తోడేళ్ళూ, పెద్దపులులూ అతణ్ణి అనుచరులతోపాటు, కొంతసేపట్లో యిక్కడికి తప్పకుండా మందవేసుకు రాగలవు,'' అన్నాడు.

పింగళుడు మాట పూర్తి చేయకముందే, ఆ కొండలోయల్లో హాహాకారాలు బయలుదేరినై. వాటితోపాటు తోడేళ్ళ అరుపులూ, పెద్దపులుల రంకెలూ కూడా వినిపించినై. చూస్తూండగానే వందల సంఖ్యలో వున్న ఎడారి దొంగలు, అన్ని వైపులా చుట్టుముట్టుతున్న క్రూర మృగాల నుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, ఎటూ దారి కానక, పద్మపాదుడూ, పింగళుడూ వున్న చోటుకు భీతితో అరుస్తూ రాసాగారు. —(ఇంకావుంది)






# రాజు నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు పడుతున్న యింత శ్రమకూ కారణం, నీ అమాయకత్వమా లేక నీపట్ల విధి వక్రించడమా అన్న అనుమానం కలుగుతున్నది. ఎంతో దయాధర్మ గుణాలున్న వాళ్ళే, ఒక్కొక్కసారి పరమ స్వార్థపరులుగా, కఠినాత్ములుగా ప్రవర్తిస్తారు. నిన్నీకార్యానికి నియోగించిన వాళ్ళు, కార్యం సానుకూలమయ్యాక అలా ప్రవర్తించరన్న నమ్మకమేమిటి? ఇందుకు ఉదాహరణగా భీమేశ్వరు డనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను.'' అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



భీమేశ్వరు డనే రాజు పాలిస్తున్న గిరి దుర్గరాజ్యంలో, రంగాపురం, రామాపురం అనే గ్రామాలు పక్కపక్కలనే వుండేవి. రంగాపురం అధికారి సీనయ్య ప్రజా క్షేమం కోరినవాడు. రామాపురం అధికారి గోపయ్య స్వార్థపరుడు.

రంగాపురం పల్లపుగ్రామం. చుట్టు పక్కల వానలు ఎక్కువగాపడితే, ఎక్కడెక్కడి నీరూ వచ్చి, గ్రామం జలమయం అవుతూండేది. దీన్ని ఎలా నివారించడమా అని సీనయ్య చాలా ఏళ్ళుగా తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఒకసారి ఆ గ్రామానికి వసంతఋతువులో, ఒక జ్ఞాని వచ్చాడు. ఆయన రంగాపురం వైభవం చూసి, చాలా సంతోషించి, "నెలకు మూడు వానలు కురిసి, మీరెప్పుడూ యిలాగే వైభవంగా జీవించాలి," అన్నాడు.

ఆ మాటలకు సీనయ్య కంగారుపడిపోతూ, "నెలకు మూడు వానలనకండి, స్వామీ! వానలంటేనే మాకు భయం," అంటూ గ్రామం ఎదుర్కొంటున్న నీటి ముంపు సమస్య గురించి జ్ఞానికి వివరించి చెప్పాడు.

జ్ఞాని వెంటనే, "అలాగా! అయితే, ఇప్పుడే ఒకసారి నేను గ్రామమంతా తిరిగి చూస్తాను. నువు కూడా నాతో రా," అన్నాడు.

సీనయ్య ఆయనకు మొత్తం గ్రామం చూపించి, వాననీరు ఏ వైపులనుంచి ఎలా వస్తుందో చెప్పకున్నాడు.

జ్ఞాని కొంచెం సేపు ఆలోచించి, "మీ సమస్యను పరిష్కరించడం కష్టం కాదు. గ్రామం చుట్టూ బాగా లోతూ, వెడల్పుగా వుండే కందకం తవ్వించు. గ్రామం పక్కనే ఒక చెరువు కూడా నిర్మించు. చెరువులో నీరు కందకంలోకీ, కందకంలో నీరు కొండప్రాంతాలకూ పోయే విధంగా తూములు పెట్టించు. ఈ పనులు చేయడానికి లక్షాయాభైవేల వరహాలు అవసరం అవుతుంది. అది, యీ దేశపురాజు భీమేశ్వ

రుడి నడిగితే యిస్తాడు,'' అని సలహా చెప్పాడు.

జ్ఞాని సలహా సీనయ్యకు నచ్చింది. అలాగే చేయాలనుకున్నాడు. ఈ లోగా, జ్ఞాని రంగాపురం వెళ్ళి సీనయ్య కిచ్చిన సలహా గురించి, గోపయ్యకు తెలిసింది. అయన వెంటనే జ్ఞానిని తన గ్రామానికి ఆహ్వానించి, "మా గ్రామం కలకాలం బాగుండడానికేదైనా ఉపాయం చెప్పండి.'' అని అడిగాడు.

రామాపురం కాస్త ఎత్తు ప్రదేశాన వున్నది. ఆ గ్రామానికి నీటి ముంపు సమస్య లేదు. అందరూ సుఖశాంతులతో జీవిస్తున్నారు.

జ్ఞాని గ్రామం అంతా తిరిగి వచ్చి, "ఇలాంటి గ్రామంలో వున్నవాళ్ళు అదృష్ట వంతులు. గ్రామంలోనే కాక, చుట్టూ కొబ్బరి తోటలున్నవి. కొబ్బరికాయల పీచుతో ప్రజలకు ఉపయోగించే ఎన్నో వస్తువులు చేసి దేశ, విదేశాల్లో అమ్మ వచ్చు. అందుకు అయిదులక్షల వరహాలు పెట్టుబడిగా కావాలి. ఈ దేశపు రాజు నుంచి డబ్బు తెచ్చి, గ్రామంలో పరిశ్రమ ప్రారంభించు. అది ఎందరికో జీవనోపాధి కూడా అవుతుంది,'' అన్నాడు.

ఈ సలహా విని గోపయ్య ఎంతో సంతోషించాడు.



తన గ్రామాన్ని వానలబారి నుంచి కాపాడడానికి సీనయ్య రాజు దగ్గిరకు బయలుదేరాడు. అది తెలిసి గోపయ్య కూడా బయలుదేరాడు. తన తెలివి తేటలతో రాజు నుంచి ధనసహాయం పొందడం కోసం సీనయ్య కంటె ముందు గానే గోపయ్య రాజధాని చేరి, ఆ రోజే తనకు తెలిసిన కోశాధికారిని కలుసుకున్నాడు.

కోశాధికారి, గోపయ్య చెప్పినదంతా విని, "నిజం చెప్పు! ఏనాడూ లేనిది యిప్పుడు, మీ గ్రామంలో కొబ్బరిపీచు పరిశ్రమ ప్రారంభించాలన్న ఆలోచన, నీకెందుకు వచ్చింది?'' అని అడిగాడు.



"నాకు బోలెడు కొబ్బరి తోటలున్నవి. పీచంతా వృథాగాపోతున్నది. గ్రామంలో పరిశ్రమ వుంటే, దాన్ని మంచి ధరకు అమ్ముకోవచ్చు," అన్నాడు గోపయ్య.

"ఆ పరిశ్రమ కూడా నువ్వే ప్రారంభించి, బాగా లాభాలు గడించాలనుకుంటున్నావు, అవునా?" అన్నాడు కోశాధికారి.

"అదీ నిజమే!" అన్నాడు గోపయ్య.

"నిజం ఒప్పుకున్నావు గనక, మంచి సలహా యిస్తాను. రాజుగారు ధర్మగుణం కలవారని అందరూ ఎరిగిందే. కాని, ఆయనది అదొకరకం పద్ధతి. అడిగినదంతా ఎవ్వరికీ యివ్వకూడదని, ఆయన సిద్ధాంతం. నీకు అయిదులక్షల వరహాలు కావాలంటే, పన్నెండు లక్షలు కావాలని అడుగు. ఆయన ఆరు లక్షలిస్తారు," అన్నాడు కోశాధికారి.

"నాక్కావలసింది ఆరులక్షలు కాదు; అయిదులక్షలే! అందువల్ల, ఆయన్ను పదిలక్షల వరహాలు అడుగుతాను," అన్నాడు గోపయ్య.

"ఆరులక్షలు పుచ్చుకునే మార్గం చూడు. అప్పుడు లక్ష మిగులుతుంది. దాన్ని చెరిసగం చేసుకుందాం," అన్నాడు కోశాధికారి.

గోపయ్య సంతోషంగా అంగీకరించాడు. కోశాధికారి ఆయనను ఒక వారం రోజులు రాజధానిలో వుండమన్నాడు.

ఈలోగా సీనయ్య కూడా రాజధాని చేరాడు. ఈ సంగతి తెలిసి గోపయ్య మనసు పరిపరివిధాలపోయింది. తనేమో గ్రామంలో పరిశ్రమ పెట్టాలని వచ్చాడు. అందువల్ల ఎక్కువగా లాభం పొందేది తనే! సీనయ్య చేయబోతున్న పని గ్రామస్థులందరికీ లాభం చేకూర్చేది. ఆ కారణంగా, తనకంటే, అతడికి ఎక్కువ పేరు వస్తుంది. అలా జరగకుండా అతణ్ణి తప్పుదారి పట్టించాలి!

ఇలా ఆలోచించి గోపయ్య, సీనయ్యను చూడబోయి, "సీనయ్యా, పొరుగు గ్రామం వాడివి కాబట్టి, నీ మేలుకోరి అసలు

రహస్యం చెప్పేస్తున్నాను. రాజుగారికి పెద్ద మొత్తాలుగా డబ్బడిగేవాళ్ళంటే కోపమూ, చిరాకూ అని తెలియవచ్చింది. తక్కువ అడిగినవాళ్ళకు ఆయన రెట్టింపు డబ్బు యిస్తాడట. నువ్వు, నీ పనికి లక్ష వరహాలు కావాలని అడుగు; ఆయన రెండు లక్షల వరహాలిస్తాడు. గ్రామంలో కందకం వగైరా పనుల ఖర్చులు పోను, నీకు యాభైవేల వరహాలు మిగుల్తాయి," అన్నాడు.

సీనయ్య జవాబేమీ యివ్వకుండా వూరుకున్నాడు. గోపయ్య సలహా ఆయనకేమీ నచ్చలేదు. కాని, రాజును డబ్బు అడగడంలో ఆయన చెప్పినట్టే చేయాలనుకున్నాడు.

నాలుగు రోజుల తరవాత రాజు, ఎక్కడెక్కడి నుంచి వచ్చిన గ్రామాధికారుల్నీ తన కొలువుకు పిలిపించి, వారి, వారి అవసరాలేమిటని అడిగాడు. గ్రామాధికారు లొక్కరొక్కరే వాళ్ళ, వాళ్ళ అవసరాలు చెప్పుకుంటున్నారు. రాజు వాళ్ళకు అడిగినదాంట్లో సగం ధనం మాత్రమే యిస్తున్నాడు. సీనయ్య యిదంతా శ్రద్ధగా గమనిస్తున్నాడు.

సరిగ్గా సీనయ్య ముందు ఒక గ్రామాధికారి, రాజును తన గ్రామం చుట్టూ కందకం తవ్వించాలని మూడు లక్షల వరహాలడిగాడు. అయితే రాజు ఆయనకు లక్షా యాభై వేల వరహాలు మాత్రం యిచ్చాడు.





దానం చేస్తాం. అప్పుడు లక్ష వరహాలు సరిపోతుంది. అందులో సగం మేమే చందాలరూపంలో సమకూర్చుకుంటాం. ఈ కారణాలవల్ల తమను యాభైవేల వరహాలు మాత్రమే అడిగాను,'' అన్నాడు సీనయ్య.

ఈ మాటలకు రాజు ఎంతో సంతోషించి, ''మీది ఆదర్శగ్రామం! నువ్వు అందరికీ ఆదర్శపాత్రుడు కావలసిన అధికారివి. నేను, మీ గ్రామానికి రెండులక్షల వరహాలు యిస్తున్నాను,'' అన్నాడు.

తరవాత రాజు మిగతా గ్రామాధికారు లందరితో, ''మీ గ్రామాల విషయంలో, నా మనసు మార్చుకున్నాను. ప్రస్తుతం మీకెవ్వరికీ డబ్బివ్వబోవడం లేదు. మీరు చెప్పినదంతా విన్నానుకదా! కొంత కాలం గడిచాక, నేను పంపే ఉద్యోగి మీ గ్రామాలకు వచ్చి, ఏం చేయవలసిందీ నిర్ణయిస్తాడు. అప్పుడు మీకు సాయపడేం దుకు ప్రయత్నిస్తాను. అయితే, ఒక విషయం గుర్తుంచుకోండి! ఇక నుంచి నేను మీకివ్వబోయేది అప్పుకింద లెక్క. అది తీరేవరకూ గ్రామప్రజలు ఏటా ప్రతి ఒక్కరూ, నూరు వరహాలు నాకు అదనపు పన్ను చెల్లించాలి,'' అన్నాడు.

ఇది విని గ్రామాధికారులందరూ హాహాకారాలు చేశారు. రాజు అవేం

సీనయ్య వంతు వచ్చింది. సీనయ్య రాజుతో, ''మా గ్రామం చుట్టూ కందకం తవ్వించాలి. యాభైవేల వరహాలిప్పిం చండి, ప్రభూ!'' అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా, ''ఇప్పుడే ఒకరికి కందకానికి లక్షాయాభైవేల వరహా లిచ్చాను. నువ్వింత తక్కువ అడుగు తున్నావేం? మీ గ్రామం చాలా చిన్నదా?'' అని అడిగాడు.

''మా గ్రామం అంత చిన్నదేం కాదు. అయినా, మా అవసరాలకు పూర్తిగా రాజుగారి పైన ఆధారపడితే ఎలా? మా క్కావలసింది లక్షాయాభైవేల వరహాలు. గ్రామవాసులం అందరం శ్రమ

పట్టించుకోకుండా సింహాసనం దిగి, తన మందిరానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ధర్మపరుడని పేరు పొందిన రాజు ప్రవర్తన దురన్యాయంగా లేదా? రంగాపురం అధికారి సీనయ్యకు రెండు లక్షల వరహాలు దానంగా యిచ్చినవాడు, ఆ సమయంలో యితరులకు అప్పుగా కూడా యివ్వకపోగా, అలా యిచ్చిన నాడు అదనంగా పన్నులు వసూలు చేస్తానంటున్నాడు. ఇది పచ్చి పిసినారితనం కాదా? రాజు ప్రవర్తనలో హఠాత్తుగా యింతటి మార్పు రావడానికి కారణం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు ప్రవర్తనలో హఠాత్తుగా వచ్చిన మార్పుకు పిసినారితనం కారణం కాదు. సీనయ్య తన గ్రామానికి అవసరం అయిన డబ్బు గురించి చెప్పి, దానిలో ఎక్కువ భాగం తమ గ్రామ ప్రజలే ఎలా భరించబోతున్నదీ, రాజుకు వివరించాడు. దానితో రాజుకు ఒక ముఖ్య విషయం అర్థమయింది. అనేకమంది గ్రామాధికారులు, తమ గ్రామ అవసరాలకంటే, స్వలాభాలకు ఆయనవద్ద డబ్బు తీసుకుపోతున్నారు. ఆ కారణం వల్ల, రాజు దేశంలోని ప్రజలందరి పైనా ఎక్కువగా పన్నులు వేయవలసి వస్తున్నది. అలా కాక, సీనయ్య చేయబోతున్న విధంగా ప్రతి గ్రామం వాళ్ళూ, సాధ్యమైనంతలో తమ స్వశక్తి ద్వారా గ్రామావసరాలు తీర్చుకోగలిగితే, రాజు దేశం మొత్తం అభివృద్ధికి తగిన ప్రణాళికలు వేయవచ్చు. ఈ సంగతి మిగతా గ్రామాధికారులకు అర్థం అయేలా చేయడానికే, రాజు ధనసహాయం విషయంలో వాళ్ళకు అంత కఠినమైన షరతులు పెట్టాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అంగరక్షకుడు

చందనపురం రాజుకు, ఒక కొత్త అంగరక్షకుడు కావలసి వచ్చింది. ఆ పదవికోసం వచ్చిన వాళ్ళలో నలుగురు మంత్రికి అర్హులుగా కనిపించారు. వాళ్ళు నలుగురూ ధైర్యసాహసాల్లో, పరాక్రమంలో నమఉజ్జీలు. కాని, వారిలో చురుకుదనం, కార్యదీక్ష కలవాడెవడో తెలుసుకోదలిచాడు, మంత్రి.

ఆయన వాళ్ళను, "రాజుగారు పరివారంతో కలిసి అరణ్యంలో వేటాడుతూ, దారితప్పారు. అప్పుడు మీలో ఒకరూ, రాజుగారూ ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూండగా, హఠాత్తుగా రాజుగారిపై ఒక పెద్దపులి దూకింది. అప్పుడు మీరేం చేస్తారు?" అని అడిగాడు.

భీకరంగా అరుస్తూ పులిని ఎదుర్కొంటాను, అన్నాడొకడు. కత్తి దూసి చప్పున పులి వెనక్కుపోయి, దాన్ని పొడుస్తానన్నాడు, మరొకడు. పులికీ, రాజుగారికీ మధ్య నిలబడి, దాన్ని క్షణాల మీద చంపేస్తానన్నాడు, ఇంకొకడు.

మంత్రి ప్రశ్న విని చిన్నగా నవ్వుతూ నిలబడిన నాలుగోవాడు, "నేను పక్కన వుండగా, రాజుగారిపై హఠాత్తుగా పెద్దపులి దూకడం అంటూ జరగనే జరగదు. ఆయన విశ్రాంతి తీసుకుంటూండగా, నేను చుట్టూ చూస్తూ కాపలా కాస్తూంటాను," అన్నాడు.

మంత్రి, ఆ నాలుగోవాణ్ణి, రాజుగారికి అంగరక్షకుడుగా నియమించాడు.

—ప్రభల జగన్నాధరావు





# నమ్మని సమాధానం

ఒక జమీందారు సభలోని వారందరివంకా చూసి, "ఈ ప్రపంచంలో, అన్ని అనర్థాలకూ మూలకారణం ఏమిటో చెప్పిన వాళ్ళకు, వంద వరహాలు బహుమానం యిస్తాను!" అన్నాడు.

గర్వమని కొందరూ, అహంకారమని కొందరూ, అజ్ఞానమని కొందరూ—ఇలా ఎవరికి తోచిన జవాబు వాళ్ళు చెప్పారు. జమీందారుకు యీ సమాధానాలేవీ నచ్చలేదు.

అప్పుడు రామచంద్రుడనేవాడు లేచి, "సరైన సమాధానం నాకు తెలుసు! బహుమతి మొత్తం మరీ తక్కువైనందువల్ల చెప్పడానికి సంకోచిస్తున్నాను," అన్నాడు.

జమీందారు వెంటనే, "నా మనసుకు నచ్చే సమాధానం చెబితే, రెండు వందల వరహాలు యిస్తాను," అన్నాడు.

అప్పుడు రామచంద్రుడు, "ఈ ప్రపంచంలో అన్ని అనర్థాలకూ మూలం డబ్బు!" అని, తర్వాత, డబ్బు కోసం ప్రపంచంలో ఎలాంటి అన్యాయాలూ, హత్యలూ, యుద్ధాలూ జరిగాయో కళ్ళకు కట్టేలా వివరించాడు.

జమీందారు అంతా విని, "నీ సమాధానం సంగతి ఎలావున్నా, నీ కథలు నాకు నచ్చాయి. నువ్వు గొప్ప కథకుడివి!" అంటూ రెండువందల వరహాలు బహుమానంగా యిచ్చాడు.

సభలో కుత్సితుడనేవాడొకడున్నాడు. వాడి అసలు పేరు ఏమోగాని, అందరూ వాణ్ణి కుత్సితుడనే అంటారు.

వాడు సభలో చటుక్కుని లేచి నిలబడి, "రామచంద్రుడు అందర్నీ మోసం చేశాడు. డబ్బు అన్ని అనర్థాలకూ మూలమని తెలిసినవాడు, తన సమాధానానికి

బహుమానంగా డబ్బునే ఎందుకు కోరుకున్నాడు ? అందులోనూ ఎక్కువ డబ్బు కూడా కావాలన్నాడు. అంటే, అతడు తన సమాధానాన్ని నమ్మడం లేదనేకదా! తను నమ్మని విషయాన్ని మనందరిచేతా నమ్మించాలనుకోవడం, మోసం కాదా?'' అన్నాడు.

''దీనికి నీ జవాబేమిటి ?'' అని జమీందారు, రామచంద్రుణ్ణి అడిగాడు.

''మనిషి అనర్థమని తెలిసి కూడా, డబ్బు కావాలనుకుంటాడు. అందువల్లనే, అది మరింత అనర్థకారణం అవుతున్నది,'' అన్నాడు రామచంద్రుడు.

ఒక్క కుత్సితుడు తప్ప, జమీందారుతో పాటు సభలో వున్నవాళ్ళంతా చప్పట్లు కొట్టారు. కుత్సితుడు మాత్రం, ''అనర్థమని తెలిసీ డబ్బు కావాలనుకునేవాడు మూర్ఖుడనిపించుకుంటాడు. నువ్వు మూర్ఖుడివా ?'' అని రామచంద్రుణ్ణి అడిగాడు.

రామచంద్రుడు, కుత్సితుడి వంక తీవ్రంగా చూసి, ''నువ్వు, నీ బతుకు శాశ్వతమనుకుంటున్నావా ?'' అని అడిగాడు.

"ఎప్పటికీకాదు,"అన్నాడుకుత్సితుడు.

''నీ చావు నీకు తెలిసివస్తుందా, తెలియకుండా వస్తుందా ?'' అని అడిగాడు రామచంద్రుడు.

''ఎవరిచావైనా చెప్పకుండానే వస్తుంది,'' అన్నాడు కుత్సితుడు కోపంగా.

''అయితే, నువ్వింకా బతకాలనుకుంటున్నావా, చావాలనుకుంటున్నావా ?'' అని ప్రశ్నించాడు రామచంద్రుడు.

''నువ్వేం చేయాలనుకుంటున్నావు?'' అని ఎదురు ప్రశ్న వేశాడు కుత్సితుడు.

''నేను మూర్ఖుణ్ణి! బతకాలనే అనుకుంటున్నాను. మరి నీ సంగతేమిటో తెలుసుకోవాలని వుంది,'' అన్నాడు రామచంద్రుడు.

సభికులందరూ పెద్దగా నవ్వారు. అవమానంతో కుత్సితుడు తలవంచుకున్నాడు.

జమీందారు, రామచంద్రుణ్ణి మరింత ఘనంగా సన్మానించాడు.





# పెడబుద్ధి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను 'వేదభం' అనే మహామంత్రంలో సిద్ధి పొందాడు. గ్రహాలన్నీ కూటమయ్యే సమయమందు, ఆకాశంవంక చూస్తూ ఈ మంత్రాన్ని పునశ్చరణ చేసినట్టయితే, సరాసరి ఆకాశం నుండి బంగారు, వెండి, ముత్యం, పగడం, రత్నం, కెంపు, నీలం– ఈ ఏడు వస్తువులూ వర్షిస్తాయి.

మంత్రసిద్ధి గల ఈ బ్రాహ్మణ్ణి ఆశ్రయించి బోధిసత్వుడు, ఆయనకు ప్రియ శిష్యుడయ్యాడు. ఒక రోజున శిష్యుణ్ణి వెంటబెట్టుకొని గురువు అరణ్య ప్రాంతానికి చేరుకొన్నాడు.

ఆ అరణ్యంలో ఐదువందలమంది గజదొంగలున్నారు. వాళ్ళు గురు, శిష్యులిద్దరినీ అటకాయించారు. ఐతే, ఆ దొంగలలో చిత్రమైన నియమం ఒకటి వున్నది. ఇద్దరు బాటసారులు కలిసి ఆ త్రోవన వచ్చినట్టయితే ఇంటికిపోయి శిక్షారుసుము తెచ్చి తోటివానిని విడిపించుకోవటానికి అవకాశ మిచ్చి, అందులో ఒకనిని వదిలేస్తారు.

ఆ వచ్చిన బాటసారులు తండ్రీ, కొడుకులైతే తండ్రిని పోయి రమ్మని చెప్పి, రుసుము తెచ్చి కొడుకును విడిపించుకునేటందుకు అవకాశ మిస్తారు. అలానే, తల్లీ కూతురూ ఐతే తల్లినీ, సోదరులైతే అందులో ఒకణ్ణీ, గురు శిష్యులైతే శిష్యుణ్ణీ—ఇలా వదిలిపెట్టడం వాళ్ళకు మామూలు.

ఇప్పుడా వింతదొంగలు బ్రాహ్మణ్ణి తమవద్ద అట్టేపెట్టుకుని, శిష్యుడైన బోధిసత్వుణ్ణి పోయి రమ్మని పంపించారు. వెళ్ళేటప్పుడు బోధిసత్వుడు గురువుకు



నమస్కరించాడు. "గురువర్యా! భయ పడకండి. ఒకటి రెండు రోజులలో తప్పక తిరిగి వచ్చేస్తాను. ఐతే, నా మనవిమటుకు ఒక్కటి వినండి: ఇవాళ గ్రహాలన్నీ కూటమయ్యే రోజు. కొంపతీసి ఇవాళ మాత్రం మంత్రం జపించి రత్నాలవర్షం రప్పించకండి. అలా చేశారంటే మీకూ, ఈ దొంగలకూ కూడా తీరని ముప్పు కలిగి తీరుతుంది" ఇలా అని మరిమరి చెబుతూ, బోధిసత్వుడు బయలుదేరి వెళ్ళాడు.

సూర్యాస్తమయం అయింది. దొంగలు వచ్చి బ్రాహ్మణ్ణి పట్టుకొన్నారు. పుచ్చ పువ్వులాటి వెన్నెల కిరణాలను వెద చల్లుతూ పున్నమిచంద్రుడు ఆకాశాన తిరుగుతున్నాడు. బ్రాహ్మడు పైకి చూసి, గ్రహాలు కూటమయ్యే సమయం వస్తుం దని పసికట్టాడు. "దొంగల బారిని పడి, చేతకానివాడి లాగా ఈ హింసలన్నీ ఎందుకు నేననుభవించాలి? చేతిలో వున్న మంత్రాన్ని పఠించి, కనక వర్షం రప్పించి, దొంగల రుసుము వాళ్ళకిచ్చేసి, విడుదలవుతాను. స్వేచ్ఛ పొంది సుఖంగా వుంటాను," అనుకొన్నాడు.

తరవాత బ్రాహ్మడు ఆ దొంగల గుంపును చేరబిలచాడు.

"మీరు నన్నెందుకు బంధించారు చెప్పండి!" అన్నాడు.

"అయ్యా, ఇంకెందుకు? డబ్బు కోసం!" అన్నారు వాళ్ళు.

"అంతేకదా! అలా ఐతే నేను చెప్పి నట్టు చేయండి, మీరు కోరిన ధనం ఇస్తాను. ముందు నా కట్లు విప్పెయ్యండి. నాకు శుభ్రంగా స్నానం చేయించండి. నూతన వస్త్రాలు కట్టబెట్టండి. పుష్పజాతు లన్నీ తెచ్చి యిక్కడ పోగుపోయండి. నా చుట్టూ పరిమళ ద్రవ్యాలూ, ధూప దీపాదులకు కావలసిన సామగ్రులూ అమర్చిపెట్టండి. అటుపైన ఏం జరుగు తుందో చూడండి!" అని బ్రాహ్మడు చెప్పాడు.

అక్షరాలా ఆ బ్రాహ్మడు చెప్పిన ప్రకారమే చేశారు దొంగలు. తరువాత ఆయన అదును చూసి, ఆకాశం వంక దృష్టి నిలిపి, వేదభ మంత్రం ఉచ్చరించాడు. వెంటనే విలువ గల లోహాలూ, మణులూ వర్షించినై! దొంగలు గబగబ వాటన్నిటినీ ఏరి మూటలు కట్టుకొని వాళ్ళ దారిని వాళ్ళు పోయారు. వాళ్ళ వెనకనే బ్రాహ్మడూ వెళుతున్నాడు.



ఆ సమయంలో మధ్యదారిలో మరి ఒక దొంగల గుంపు తారసపడి, మొదటి గుంపును ఎదుర్కొన్నది. "ఎందుకయ్యా, మీరు మమ్మల్ని పట్టుకుంటారు?" అని అడిగారు మొదటి దొంగలు. అందుకు రెండవ గుంపు "ఇంకెందుకు, డబ్బుకోసం!" అన్నారు.

"అంతేకదా! డబ్బుకోసమే ఐతే, ఈ బ్రాహ్మణ్ణి ఆశ్రయించండి. ఈయన ఆకాశం పైకి చూస్తే చాలు, విలువ గల రత్నాలూ, మణులూ వర్షిస్తాయి. అలా చేసే మాకు ఈ ధనమంతా ఇచ్చాడు," అని చెప్పి, వాళ్ళు తప్పించుకుపోయారు.

ఇప్పుడు రెండవ దొంగల జట్టు బ్రాహ్మణ్ణి వదలక పట్టుకుంది. "మాకు కూడా ధనమియ్యవయ్యా, బ్రాహ్మడా!" అని వాళ్ళు బొబ్బలు పెట్టి పీడింపసాగారు. అందుకు బ్రాహ్మడు, "అయ్యలారా! ఇందాక ఆ దొంగలకు నేనిచ్చింది మంత్రమహిమవల్ల రప్పించిన ధనం. నేను నేర్చిన మంత్రానికి మళ్ళీ ఒక యేడాదికి గాని శక్తికలగదు. ఇది నా యిష్టం వచ్చినప్పుడల్లా జపించితే పని చేసే మంత్రం కాదు. దీనికంతా గ్రహకూటం కలియడం అదీ, చాలా గొడవ వున్నది. కనుక, ఒక్క ఏడాది అయేసరికి, గ్రహాలు కూటమవుతై; అప్పుడు నా మంత్రం పారుతుంది. ఆ వెంటనే మంత్రం జపించి, మీకు కనకవర్షం కురిపిస్తాను" అన్నాడు.

బ్రాహ్మడి మాటలు నమ్మలేదు దొంగలు. "మాకంటే ముందు వచ్చిన



పోరాటంలో మొత్తం ఒక వంద మంది నరుక్కుచావగా చివరకు ఇద్దరే ఇద్దరు మిగిలారు. ఇలా మిగిలిన దొంగ లిద్దరూ ధనా న్నంతటినీ సమీపంలోని ఒక అరణ్యంలో దాచిపెట్టారు. అందులో ఒకడు విచ్చుకత్తులతో ఆ ధనానికి కాపలా కాస్తూ వుండగా రెండవవాడు తినుబండా రాలు తేవటానికని దాపున వున్న ఊళ్ళోకి వెళ్ళాడు.

ధనాగారం వద్ద కూర్చున్న దొంగ, "నా నేస్తం వస్తే, అయాచితంగా ఈ ధనంలో సగభాగం కబళించుకపోతాడే, ఎలా?" అనే ఆలోచనతో కుమిలి పోసాగాడు.

అక్కడ తినుబండారాలు తీసుకురావ టానికి వెళ్ళిన ఆ దొంగ, "వాడు చస్తే ఈ ధనమంతా నాకే ఉండిపోతుందిగా! కుబేరుడినయిపోవచ్చుకదా!" అని అను కొని, తనవంతు పదార్థాలు కేటాయించు కుని, తక్కిన భాగంలో విషం కలిపి వేశాడు.

వాడు పదార్థాలు చేతపట్టుకొని తన బస చేరుకొనేసరికల్లా ఆ రెండవ దొంగ వీడి పీకతెగవేసి, కళేబరం దూరంగా విసరి వేశాడు! తరవాత విషం కలిసిన తిను బండారాలు తిని, చివరకు వాడూ ప్రాణాలు విడిచాడు!

వాళ్ళను ఇట్టే కుబేరులను చేసి పంపావే, మేం అడిగితే ఏడాదివరకూ కనిపెట్టుకు ఉండమంటావా, అబద్ధాలకోరా!" అంటూ పదునైన కత్తి పుచ్చుకుని బ్రాహ్మణ్ణి నిలువునా రెండు ముక్కలుగా చీల్చి వేశారు! అతని కళేబరాన్ని దారి మధ్యలో వేలాడదీశారు!!

ఇలా చేసి, గబగబ పరుగులెత్తిపోయి మొదటి దొంగల జట్టును కలసి, అందరినీ చంపి, వాళ్ళదగ్గిర వుండే ధన ద్రవ్యాలను అపహరించారు. అపహరించిన ధనం వాటాలు తెగలేదు. ఈ రెండవ జట్టు దొంగ లలో రెండు కక్షలు ఏర్పడినై. ధనంకోసం రెండు కక్షలవాళ్ళూ పోరాడుకున్నారు.

ఈ విధంగా బ్రాహ్మడూ, బ్రాహ్మడితో పాటు దొంగలూ అంతా, కలిసి మొత్తంగా చచ్చి వూరుకున్నారు.

ఒకటి రెండు రోజులలో బోధిసత్వుడు దొంగల కియవలసిన రుసుము చేత పట్టుకు వచ్చాడు. గురువుకోసం చూశాడు. గురువు కానరాలేదు. ఎక్కడ చూసినా ధనమే! ఎక్కడ చూసినా కళేబరాలే! అప్పుడే అనుకున్నాడు బోధిసత్వుడు, "ఈ బ్రాహ్మడు నా మాట చెవిని పెట్ట లేదు. తనకు తోచినంతా చేశాడు. మొన్నటి రోజున ఈ బ్రాహ్మడు మంత్రం జపించి, రత్నాలవర్షం రప్పించే వుంటాడు. దాని ఫలితంగానే అందరూ చచ్చి వుంటారు," అని తలిచి, బాటవెంబడే చూసుకొంటూ పోసాగాడు.



కొంత దూరంలో గురువుగారి కళేబరం కనిపించింది. "అయ్యో! గురువర్యా, నా మాట విన్నావు కాదుకద! ఎంతటి గతికి పాల్పడ్డావు!" అంటూ అతను వాపోయాడు. చితుకులు పోగుచేసి తెచ్చి గురువుకు దహనాది క్రియలు సలిపాడు. అడవిపువ్వులు పట్టుకవచ్చి ఆ స్థలమందు వుంచి, భక్తిపూర్వకంగా తుదిసారి నమస్కరించాడు.

అక్కడినించి ఇంకా అలా అలా వెళ్ళగా మొదటి దొంగల జట్టులోని కొందరి శవాలూ కంటపడినై. మరి కొంత దూరంలో రెండవ జట్టులో వుండే దొంగల కళేబరాలు పడివున్నయి.

రెండు తప్ప, బోధిసత్వుడికి తను చూసివున్న అందరి కళేబరాలూ లెక్కకు సరీగా కనిపించినై. ఐతే ఆ ఇద్దరూ ఎక్కడికి తప్పించుకుపోయారా అని ఆలోచించాడు. వాళ్ళు ధనం దోచుకు పోయిన జాడ కనిపెట్టి, ఆ దారినే వెళ్ళగా ఆ దారి బోధిసత్వుణ్ణి ఒక కీకారణ్యంలోకి తీసుకుపోయింది. ఆ అరణ్యంలో ధనం మూటలు కనిపించినై. తప్పిపోయారనుకొన్న ఇద్దరు దొంగల లోనూ ఒకడి కళేబరం కనిపించింది.

ఐతే వాడి పక్కన తినుబండారాలు గల పాత్ర వున్నది. "ఓహో, ఇదా సంగతి!" అని అనుకొన్నాడు బోధిసత్వుడు. ఇంకా నాలుగడుగులు వేసే సరికి ఒక మూల ఆ మిగిలివున్న దొంగ కళేబరం వేలాడదీయబడి వున్నది. ఇంకిప్పుడు ఎవరూ చెప్పనక్కరలేకుండానే జరిగిన సంగతి అంతా బోధిసత్వుడికి మొదటి నుండి చివరివరకూ అవగాహనై పోయింది.

ఇదంతా చూసి బోధిసత్వుడు చాలా విచారించాడు. "నా మాట పాటించాడు కాదు గురువుగారు. అంతగా చెప్పి పోయినా, పెడచెవిని పెట్టాడు. ఆత్మబుద్ధి సుఖమనుకున్నాడు. ఇందుకు ఫలితం? తనూ నాశనమయ్యాడు, తనతో పాటు చాలా మంది జనమూ చావటానికి కారకుడయ్యాడు. ఇతరుల మాట వినక, తమకు తోచిందే మంచిదని అనుకొని పనులు చేసేవాళ్ళకు ఇటువంటి శాస్తి జరిగే తీరుతుంది.

"నా గురువుగారు తన మంత్ర మహిమ వల్ల భూలోకానికి రప్పించిన ధనసంపద మానవకోటికి ఉపకృతి చేయలేదు సరికదా, పైగా సంఘాత మరణానికీ, అంతులేని వినాశానికీ దారి తీసింది. కనుక, బుద్ధి వక్రమార్గాన్ని పట్టినప్పుడు మంచి వస్తువులవల్ల కూడా కీడే కలుగుతుంది. దోషం వస్తువులో లేదు, బుద్ధిలో వుంది. వక్రబుద్ధి అగ్నిజ్వాల వంటిది. అది ఒకళ్ళ నాశనంతో పోదు. మరి ఎంతమందినో నాశనం చేస్తేగాని ఆ అగ్ని చల్లారదు," ఈ బోధలను బోధిసత్వుడు అరణ్యమంతా మారుమోగేటట్టు ప్రబోధించాడు. తన గురువుగారిని ఉదాహరణగా చూపి, అందరకూ నచ్చేటట్టు చెప్పాడు. బోధిసత్వుడి ప్రబోధానికి వనదేవతలు జేజేలు కొట్టారు.

అటు తరువాత ఆ ధన సంపదనంతటినీ బోధిసత్వుడు తన ఆశ్రమానికి తీసుకుపోయి, అదంతాలోకోపకారంకోసం వినియోగించి, అవతారం చాలించాడు.





## తాంతియాతోపీ— కున్వార్‌సింగ్

సిపాయిల తిరుగుబాటులో తాంతియా తోపీ అపూర్వమైన ధైర్య సాహసాలు, యుద్ధనైపుణ్యం కనబరిచాడు. అతను నానాసాహెబు ఆస్థానంలో గుమాస్తాగా వుండేవాడు. సామాన్యుణ్ణి సైతం చక్కటి సైనికునిగా తీర్చిదిద్దగల అద్భుతశక్తి ఆయనకు వుండేది.

ఒకసారి బ్రిటిష్ సేనలను చిత్తుగా ఓడించి, కాన్పూర్ నుంచి కొన్ని మైళ్ళ దూరం వరకు తరిమి తరిమి కొట్టాడు తాంతియాతోపి. సూర్యాస్తమయం కావడం వల్ల అంతటితో వదిలిపెట్టాడు. బ్రిటిష్ సేనానాయకుడు తమ దయనీయమైన ఓటమిని గురించి—భారత దేశంలోని బ్రిటిష్ సర్వసేనానాయకుడైన సర్ కోలిన్ కాంబెల్‌కు వర్తమానం పంపాడు.





ఆ వార్త అందిన వెంటనే, సర్ కోలిన్ కాంబెల్, పెద్ద సైన్యంతో కాన్పూర్ చేరాడు. అప్పుడు తాంతియాతోపి కాల్పి పట్టణంలో వున్నాడు. తాంతియాతోపి చాలాసార్లు కోలిన్ కాంబెల్ సైన్యాన్ని ఎదుర్కొని యుద్ధం చేశాడు. అతని ధైర్యం, యుద్ధనైపుణ్యం బ్రిటిష్ వాళ్ళను ఎంతగానో ఆశ్చర్యపరిచాయి.



ఒకసారి తాంతియాతోపీకి సుస్తీచేసింది. అప్పుడాయన ఒక చిన్న రాజు ఆశ్రయం కోరాడు. ఆ రాజు ఆయనను సగౌరవంగా ఆహ్వానించాడు. తాను భారతీయ పాలకుల గౌరవ స్వాతంత్ర్యాలను పరిరక్షించడానికే పోరాడుతూ వుండడం వల్ల, అటువంటి ఈ భారతీయ రాజు తనకు అపకారం తలపెట్టడని తాంతియాతోపీ నమ్మాడు.

కాని, తాంతియాతోపీకి ఆశ్రయం ఇచ్చిన ఆ పాలకుడు దుర్మార్గుడు. తాంతియాతోపీ తనవద్ద వున్న సంగతి, బ్రిటిష్‌వాళ్లకు రహస్యంగా చేరవేశాడు. తాంతియాతోపీ ఉద్యానవనంలో విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, బ్రిటిష్ సైనికులు, తోటమాలీల వేషంలో వచ్చి, అతన్ని చుట్టుముట్టి పట్టుకున్నారు.






"నాపై న్యాయ విచారణ జరిపే హక్కు మీకు లేదు. నేను బ్రిటిష్ అధికారానికి లోబడినవాణ్ణి కాను. ఇంట్లో జొరబడి దోపిడీ చేసే దొంగలు, అడ్డుపడిన ఇంటి యజమానిని పట్టుకుని, న్యాయం, చట్టం అంటూ అతని మీదే విచారణ జరపడం న్యాయవ్యవస్థనే ఎగతాళి చెయ్యడం," అని బ్రిటిష్‌వాళ్లకు ఎదురు తిరిగి గర్జించాడు తాంతియాతోపీ!

తాంతియాతోపేని ఉరితీయడం నానాసాహెబుకు తీరని విషాదం కల్గించింది. అయినా ఆ స్థితిలోనూ ఆయన బ్రిటిష్‌వాళ్ళను ఎదిరించి పోరాడాడు. అఖరికి ఆయన నేపాల్ అడవుల్లోకి పారిపోయాడు. ఆయన్ను పట్టుకోవాలని బ్రిటిష్‌వాళ్ళు ఎంతో ప్రయత్నించారు. కాని సఫలీకృతులు కాలేదు.





సిపాయిల తిరుగుబాటులో పాల్గొన్న మరో సాహసవీరుడు—బీహార్‌లోని జగదీశ్‌పూర్ పాలకుడైన రాజా కున్వర్‌సింగ్. డెబ్బై అయిదేళ్ళ వయసులోనూ ఆయన ఆయుధాలు ధరించి పోరాడాడు. తన సైనికులకు గెరిల్లాయుద్ధ విధానంలో శిక్షణ యిచ్చాడు. చెట్లపై నుంచీ, పొదలమాటు నుంచీ, వాళ్ళు బ్రిటిష్ సేనలతో పోరాటం సాగించారు.

మెరుపులాంటి తెల్లటి గుర్రాన్ని అధిరోహించి, యువవీరుడిలా పోరాడాడు కున్వర్‌సింగ్. ఒకసారి యుద్ధంలో, బ్రిటిష్ సేనలు పేల్చిన తుపాకిగుండు కున్వర్‌సింగ్ కుడిచేతికి తగిలింది. అయినా ఆయన గాయపడ్డ ఆ చేత్తో గుర్రాన్ని అదుపుచేస్తూ, ఎడమచేత్తో కత్తి తిప్పుతూ శత్రుసేనలను చిత్తు చేశాడు.





కొన్నాళ్ళకు, గాయపడ్డ చేతి నుంచి, విషం శరీరమంతా వ్యాపిస్తున్నట్టు కున్వర్‌సింగ్ గ్రహించాడు. ఆయన గంగానది గట్టున నిలబడి, "గంగా మాతా! ఇదే నీకు నా కానుక!" అంటూ ఎడమచేత్తో కత్తి తీసుకుని, కుడిచేతిని గంగా ప్రవాహంలో పడేట్టు తెగవేశాడు!

కొంతసేపటికి ఆయన స్పృహతప్పి పడిపోయి, మరనటి రోజే మరణించాడు. ఆయన తర్వాత, తమ్ముడు అమర్‌సింగ్ అచంచల ధైర్యంతో సేనలకు నాయకత్వం వహించి కోట పతనమయ్యేదాకా పోరాడాడు.





జగదీశ్‌పూర్ రాజభవనంలోని స్త్రీలు, ఫిరంగుల ముందు నిలబడి, వాటికి నిప్పంటించి, తమ ప్రాణాలను ఆహుతి చేశారు. అమర్‌సింగ్ అక్కడి నుంచి పారిపోయాడు. సిపాయిల తిరుగుబాటు అంతం కాసాగింది.



# దుష్టుడి విందు

షిరాజ్‌నగర పరిసరాల్లో అలీఖుద్దుస్ అనే వాడొకడుండేవాడు. అతడి తండ్రీ, తాతలు మంచి ధనవంతులు. కాని, , అలీ పెరిగి పెద్దవాడవుతున్నదశలో, అతడి తండ్రీ వ్యాపారంలో బాగా నష్టపోయి, ఉన్న ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. ఆ కారణం వల్ల అలీకి మిగిలింది శిథిలావస్థలో వున్న పెద్ద భవంతీ, దాని పక్కనే వున్న ఒక చిన్న ఇల్లూ.

అలీ ఒంటరిగా తన తండ్రి వదిలి పోయిన భవంతిలో నివసిస్తూండేవాడు. పక్కన వున్న ఇంటిలో అద్దెకుంటున్న వాళ్ళు, నెల నెలా అతడికి అద్దె చెల్లిస్తూండేవాళ్ళు. అలీ ఆ అద్దె డబ్బు ఖర్చు చేసేవాడు కాదు. ఆ మొత్తాన్ని ఒక రాతి జాడీలో పెట్టి, దాన్ని ఇంటి ఆవరణలో ఒక మూలగా వున్న పాడు బడిన బావి దగ్గిర పాతేస్తూండేవాడు. అందుకు కారణం అలీ వుంటున్న భవంతికి సరయిన తలుపులూ, దర్వాజాలూ కూడా వుండేవికావు. వాటిని అప్పులవాళ్ళు ఏనాడో ఊడబెరుక్కుపోయారు.

అలీ వుంటున్న భవంతికి కొంత దూరంలో వున్న ఒక గుడిసెలో, ఒక సోమరిపోతు వుండేవాడు. వాడు చాలా దుష్టుడు. వాడు అలీ పట్ల ఎంతో స్నేహం నటిస్తూ, అతడు డబ్బు ఎక్కడ దాస్తున్నదీ తెలుసుకోవాలని ప్రయత్నించ సాగాడు.

ఇలా కొన్నాళ్ళు జరిగాక, వాడు, ఒకసారి రహస్యప్రదేశాన దాగివుండి, రాత్రివేళ అలీ జాడీలో డబ్బు పెట్టి, దాన్ని గుంటలో పాతిపెట్టడం చూశాడు.

ఆ తరవాత ఒకనాటి రాత్రి అలీ నిద్రలో వుండగా, ఆ దుష్టుడు జాడీని తవ్వి తీసుకుని తన గుడిసెకు పోయాడు.

అరేబియా కథ



అందులో వాడికి అరవై వెండికాసులు కనిపించినై.

ఆ మర్నాడు అలీ, ఇంటివాళ్ళిచ్చిన అద్దె డబ్బు ఐదు వెండికాసులు తీసుకుని, జాడీలో దాచేందుకు వెళ్ళాడు. కాని, తవ్వి చూడగా జాడీ లేదు. వెంటనే అతడికి సోమరిపోతుపై అనుమానం కలిగింది. వాడు అప్పుడప్పుడూ తాను ఇంటి ఆవరణలో తిరుగుతూండగా, మొండిగోడపై నుంచి తొంగిచూడడం అలీకి గుర్తు వచ్చింది. ఇది, ఆ దుష్టుడి పనే అని అలీ గ్రహించాడు.

అరవై వెండికాసుల్ని అంత సునాయాసంగా దొంగిలించ గలిగినందుకు సోమరిపోతుకు చాలా ఆనందం కలిగింది. వాడు, అలీ తనను అనుమానించకుండా వుండేందుకు, రోజూ మాదిరిగానే, అతడి దగ్గిరకు పోయి, ఏవో కబుర్లాడేందుకు బయలుదేరాడు.

అలీ, వాణ్ణి కిటికీలోంచి అంత దూరానే చూశాడు. వెంటనే అతడు తన దగ్గిరున్న ఐదు వెండికాసుల్ని ద్వారం ముందు పరిచి, వీధివైపుకు వీపుపెట్టి కూర్చుని, "జాడీలో వున్న అరవై వెండి కాసులకు, యీ రాత్రి యీ అయిదు కాసులూ చేరుస్తాను. అంటే, జాడీలో అరవైఅయిదు కాసులుండబోతున్నవి. ఆహాఁ, ఎంత పెద్ద మొత్తం!" అంటూ, తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుగా అనసాగాడు.

సోమరిపోతు వెనక నుంచి వస్తూ, అలీ అంటున్న మాటలు విన్నాడు. కాని, అవేం విననివాడిలా నవ్వుతూ అతణ్ణి సమీపించాడు.

అలీ, వాడిని చూస్తూనే వెండి కాసుల్ని దుస్తుల్లో దాచుకుని, మర్యాదగా పలకరించాడు.

సోమరిపోతుకు, ఆ అయిదు వెండి కాసుల్ని కూడా తనవి చేసుకోవాలన్న బుద్ధి పుట్టింది. తను జాడీని ఎప్పటిలా బావి దగ్గిర పాతిపెడితే, అలీ ఒక రాత్రి

వేళ అందులో యీ అయిదు కాసులు కూడా దాచేస్తాడు. ఆ మర్నాటి రాత్రి తను మొత్తం అరవైఅయిదు కాసుల్నీ దొంగిలిచ్చవచ్చు!

అయితే, పట్టపగలు జాడీని యథా స్థానంలో పాతిపెట్టడం ఎలా అన్న సమస్య సోమరిపోతుకు ఎదురైంది. ఆ శిథిలమై పోతున్న భవంతి ఆవరణలో పగటిపూట కూడా ఎవరూ ప్రవేశించరు. అలీని ఏ విధంగానైనా, కొంతసేపు అక్కడ లేకుండా చేయగలిగితే, తాను జాడీని రహస్యంగా తిరిగి బావి దగ్గిర పాతి పెట్టవచ్చు!

ఇలా ఆలోచించి సోమరిపోతు, అలీతో, "మిత్రమా, నాకు ఎంతోకాలంగా ఒక కోరిక తీరకుండానే వుండిపోయింది," అన్నాడు.

"ఏమిటది?" అన్నాడు అలీ.

"ఈ దాపులనున్న ఏదైనా భోజన శాలలో, నీకు విందు చేయాలన్నది, నా కోర్కె. ఈ రాత్రి నీకేమైనా తీరుబాటు వుంటుందా?" అని అడిగాడు సోమరి పోతు చిన్నగా నవ్వుతూ.

"అదేం మాట! నీలాంటి ప్రాణ మిత్రుడు కోరి విందుకు రమ్మని ఆహ్వా నిస్తూంటే, నాకు తీరుబాటు లేకపోవ డమా?" అన్నాడు అలీ ఎంతో ఉత్సాహం కనబరుస్తూ.

ఆ రాత్రి యిద్దరూ భోజనశాల దగ్గిర కలుసుకున్నారు. సోమరిపోతు రకరకాల



మాంసాలా, పిండివంటలా పేర్లు భోజన శాల యజమానికి చెప్పి, వాటిని వెంటనే తయారు చేయించమన్నాడు.

వంటగదిలో ఆ పదార్థాలన్నీ తయారవుతూండగా సోమరిపోతు చిన్న గొంతుతో, "అలీ! ఏమనుకోవద్దు. డబ్బు తేవడం మరిచాను. ఇప్పుడే ఇంటికి వెళ్ళి వస్తాను," అంటూ బయలుదేరాడు.

అలీ సరేనన్నాడు.

సోమరిపోతు గుడిసెకు వెళ్ళి, అరవై వెండికాసులున్న జాడీ తీసుకుని అలీ భవంతి ఆవరణలోకి వెళ్ళాడు. అక్కడ వాడు దాన్ని పాతచోటనే జాగ్రత్తగా పాతిపెట్టి, వేగంగా భోజనశాలకు తిరిగి వచ్చాడు.

విందుభోజనం ముగిసింది. అలీ తన పథకం పారిందనీ, సోమరిపోతు తన పథకం పారిందనీ—ఇద్దరూ ఎక్కడలేని సంతోషంలో వున్నారు.

అలీ భోజనశాల నుంచి ఇంటికి వెళుతూనే, సోమరిపోతు తిరిగి పాతిపెట్టిన జాడీ తవ్వి తీసి మరొకచోట దాచి, ఆ రాత్రి హాయిగా నిద్రపోయాడు.

సోమరిపోతు ఆ మర్నాటి రాత్రి రహస్యంగా జాడీని తవ్వి తెచ్చుకునేందుకు వెళ్ళాడు. వాడికి చాలా ఆనందంగా వున్నది. ఇప్పుడా జాడీలో వుండబోయేవి అరవై వెండికాసులు కాదు—అరవై అయిదు. అంటే, లోగడకన్న మరింత బరువన్నమాట!

సోమరిపోతు జాడీ పాతినచోట తవ్వుతూండగా, వెనక నుంచి అలీ హేళనగా నవ్వడం వినిపించింది.

వాడు అదిరిపడి తల తిప్పి చూశాడు. అలీ పొట్టచెక్కలయేలా నవ్వుతూ, "ఆహా, ఎంత చక్కని విందుభోజనం. నీకు అభినందనలు చెబుదామని యిక్కడికి వచ్చాను!" అన్నాడు.

ఆ మరుక్షణం సోమరిపోతు లేచి, అక్కడి నుంచి వీధిలోకి పరిగెత్తాడు. ఆ తరవాత వాడెన్నడూ అలీ చాయలకు కూడా రాలేదు.





# దేవత-దయ్యం

వరదేశ్వరం అనే గ్రామ పొలిమేరల్లో, గ్రామదేవత గుడి ఒకటుండేది. ఆ గుడికి పెద్ద మాన్యంతోపాటు, దేవతకు చాలా విలువైన ఆభరణాలుండేవి. నిత్యం వచ్చే పోయే భక్తులతో గుడి ప్రాంగణం కళకళ్ళాడుతూండేది.

ఒకనాటి చీకటి పడుతున్నవేళ గ్రామ దేవత గుడిలోంచి బయిటికి వచ్చి, ఆవరణలో ఒక మూలగా వున్న వేపచెట్టుపై కూర్చున్నది. ఆ చెట్టుకు దూరంగా, శిథిలమైపోయిన ఒక చిన్న కోట పక్కన చింతచెట్టు మీద చాలా కాలంగా ఒక దయ్యం వుంటూండేది.

గ్రామంలో ఎవరికీ హాని తలపెట్టని ఆ దయ్యమంటే, గ్రామదేవతకు కొద్దిపాటి ఆదరణ వుండేది. ఆ కారణం వల్ల ఆమె, దయ్యంతో తరచు మాట్లాడుతూండేది. ఆ రోజు మాటల సందర్భంలో ఆమె, గ్రామంలోని తన భక్తులు ఎంతెంత ఘనంగా తనకు పూజలు జరిపి, కానుకలు చెల్లిస్తున్నదీ దయ్యానికి వివరంగా చెప్పింది.

అంతా విన్న దయ్యం, "తల్లీ, నువ్వు వట్టి అమాయకురాలివి. మనుషులు పెద్ద మోసగాళ్ళు. వాళ్ళల్లో వాళ్ళే కాదు, దేవుళ్ళతో కూడా అవసరాన్నిబట్టి భక్తి గౌరవాలు కనబరుస్తారు. నిన్ను అడ్డం పెట్టుకుని, నీ సొమ్ము తింటూ బతికే పెద్ద మనుషుల్లాంటివాళ్ళు, ఈ గ్రామంలో కొందరున్నారు," అన్నది.

ఆ మాటలకు గ్రామదేవతకు కోపం వచ్చింది. ఆమె, దయ్యంతో, "నీకు మనుషులంటే అక్కసు. అందువల్లనే యిలా మాట్లాడుతున్నావు. నా భక్తులు, నేను గీసినగీటు దాటరని రుజువు చెయ్యమంటావా?" అన్నది.

వీరేపల్లి జయరాంరెడ్డి



ఆ సమయంలో గ్రామ భూతవైద్యుడు అక్కడికి వచ్చి, గుడిచుట్టూ ప్రదక్షిణ చెయ్యసాగాడు.

గ్రామదేవత, దయ్యానికి వాణ్ణి చూపించి, ''వీడు ఎన్నాళ్ళనుంచో నన్ను కొలుస్తున్నాడు. పాపం, చాలా బీదవాడు. ఈ రాత్రే యితణ్ణి అనుగ్రహించబోతున్నాను,'' అన్నది.

''అలాగే, తల్లీ! వీడు, నీపట్ల ఎంత భక్తిగలవాడో పరీక్షించేందుకు, నాకూ అవకాశం యివ్వు. నేనూ, వాడికి నా చేతనైన సాయం చేస్తాను,'' అన్నది దయ్యం.

ఆ రాత్రి దేవత భూతవైద్యుడికి కలలో కనిపించి, తాను వాణ్ణి కటాక్షించినట్టు చెప్పి, ఉదయానే ఆలయధర్మకర్తను కలుసుకోమన్నది. తరవాత ధర్మకర్తకు కలలో ప్రత్యక్షమై, భూతవైద్యుడికి ఆలయంలో లెక్కలు చూసే పని యివ్వమని ఆజ్ఞాపించింది.

తెల్లవారుతూనే భూతవైద్యుడు, ధర్మకర్తను చూడబోయాడు. ధర్మకర్త ఏమీ ఎరగనట్లే, భూతవైద్యుణ్ణి అడిగి సంగతి తెలుసుకుని, ''అయ్యో, అమ్మవారు నీతో అలా అన్నదా? నాతో, ఆ తల్లి ముందుగా మాట మాత్రమైనా చెబితే బావుండేదే! ఆ లెక్కలు చూసే పని ఒకళ్ళకు యిస్తానని మాట యిచ్చేశానే,'' అన్నాడు.

ఆ సాయంత్రం ధర్మకర్త గుడికి వెళ్ళి దేవతకు సాగిలబడి, ''అమ్మా, రాత్రి కలలో నేను, నీతో మాట్లాడదాం అనుకునేంతలో, మాయమయ్యావు. నేను, నిన్ననే ఒకరికి మాట యిచ్చాను. నీ భక్తులు మాట తప్పరన్న పేరుంది. ఇప్పుడు యిచ్చిన మాట తప్పమంటావా?'' అంటూ కన్నీళ్ళుకార్చి వెళ్ళిపోయాడు.

దేవత కరిగిపోయింది. ధర్మకర్తకు యింకాస్త ముందే చెబితే బావుండేదనుకున్నది. భూతవైద్యుడికి ఆ పని యిస్తే, తాను సొమ్ము దొంగిలించడం సాధ్యపడదని, ధర్మకర్త, యీ కపటనాటకం ఆడిన సంగతి దేవతకు తెలియదు.

ఇదంతా దయ్యం గమనిస్తూనే వున్నది. ఆ రాత్రి అది భూతవైద్యుడి కలలో కని పించి, "నువ్వు, నాకు పగవాడివైనా, నీకు సాయపడదామని వచ్చాను. నేను యీ ఊరి గ్రామాధికారి కూతుర్ని పట్టు కుంటాను. నువ్వు తప్ప, ఏ మంత్రగాడికీ లొంగను. నువ్వు వస్తేనే, నేను ఆమెను వదులుతాను. జనంలో నీకు పేరుతోపాటు డబ్బు కూడా వస్తుంది," అన్నది.



భూతవైద్యుడు ఎంతో సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆ మర్నాడే గ్రామాధికారి కూతురిని దయ్యం పట్టినట్టు వాడికి తెలి సింది. తన గొప్పతనం చూపేందుకు ఒకటి, రెండు రోజులాగి, నెమ్మదిగా గ్రామాధికారి ఇంటికి వెళదాం అను కున్నాడు వాడు.

దయ్యం, భూతవైద్యుడికి సహాయ పడడం తెలిసి, గ్రామదేవత వాడికి ఆ రాత్రి కలలో కనిపించింది. వాడు ఎంతో నిష్ఠురంగా, "ఏం తల్లీ! అసలే దరిద్రుణ్ణి. దానికి తోడు నన్ను అవమానాలపాలు కూడా చేస్తున్నావు," అన్నాడు.

దేవత వాడితో, "పొరబాటు జరిగి పోయింది. ఈసారి నిజంగా మేలు కలి గేలా చేస్తాను. రేపే వెళ్ళి నామాల గోవిం దయ్య శెట్టిని కలుసుకో. నీకు అవసరం అయిన ధనసహాయం చేసేందుకు ఏర్పాటు చేశాను. కాని, ఒకటి గుర్తుం చుకో! నిజంగా,, నా మీద నీకు భక్తి వుంటే, మరెవరి సహాయాన్నీ ఆశించకు," అన్నది.

తరవాత దేవత గోవిందయ్యశెట్టి కలలో కనిపించి, సంగతి చెప్పింది. శెట్టి ఎంతో భక్తిగా, "నీ యిష్టమే, నా యిష్టం, తల్లీ!" అన్నాడు.

మర్నాడు భూతవైద్యుడు రాగానే శెట్టి మండిపడుతూ, "పైసాపైసా కూడబెట్టి యింతవాణ్ణయాను. ఈ దానం, ధర్మం అనేవి మా ఇంటా, ఒంటా లేవు. అమ్మ వారు యివ్వమనడం; నువ్వు రావడం! కావాలంటే, యీ కాలవరహా పట్టుకుపో."

అని, భూతవైద్యుడి చేతిలో చిన్న నాణెం పెట్టాడు.

భూతవైద్యుడు రోషంగా దాన్ని నేల కేసి కొట్టి, ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత గోవిందయ్యశెట్టి శుచిగా స్నానం చేసి, ముఖాన యింతేసి నామాలు తీర్చిదిద్ది, గుడికి వచ్చి, అమ్మవారి కాళ్ళ మీద పడిపోతూ, "తల్లీ, ఏం చెప్పేది! నా బతుకు పూచికపుల్లకన్నా లోకువై పోయింది. నా పెళ్ళాన్ని నమ్మి ఆస్తి అంతా దానిపేర రాశాను. రాత్రి నీ ఆజ్ఞ గురించి చెప్పబోతే, మహంకాళిలా లేచి నన్ను ఇంట్లోంచి తరిమేస్తానన్నది. క్షమించమ్మా, నీ ఆజ్ఞ నెరవేర్చలేని పిరికి భక్తుణ్ణి." అని, లేచి ఇంటి దారిపట్టాడు.

గ్రామదేవత అతడి మీద జాలిపడుతూ, "పాపం, నా మీద ఎంత భక్తి వున్నా కట్టుకున్నదే అలా ఎదురుతిరిగితే ఏం చేస్తాడు!" అనుకున్నది.

భూతవైద్యుడు నాలుగు రోజుల తరవాత గ్రామాధికారి ఇంటికి వెళ్ళి, ఎవ్వరికీ లొంగని దయ్యాన్ని, నాలుగు మంత్రాలు చదివి పారదోలాడు. వాడికి గ్రామాధికారి చాలా ధనం బహూకరించాడు. వాడికి గ్రామంలోనే కాక, చుట్టు పక్కల గ్రామాల్లో కూడా గొప్ప భూతవైద్యుడన్న పేరు వచ్చింది. ఈసారి దయ్యం, వాణ్ణి ముందుగా హెచ్చరించి పోయి, పక్క ఊరు జమీందారు కూతురును పట్టుకున్నది.



భూతవైద్యుడికి తన మీద కన్న, దయ్యం మీద ఎక్కువ నమ్మకం కలగడం చూసి సహించలేక గ్రామదేవత ఒక రాత్రి వాడి కలలో ప్రత్యక్షమైంది.

వాడు రెండు చేతులూ జోడించి, "తల్లీ! నీకూ, నీ మేలుకూ దణ్ణం. ఏదో దయ్యం పుణ్యమా అని లక్షణంగానే బతికి పోతున్నాను. నన్ను వదిలెయ్యి." అన్నాడు.

గ్రామదేవతకు వాడి మాటలు అవమానంగా తోచినా శాంతించి, "చూడు, నీకు యిదే నా చివరి సాయం. ఈ మధ్య కొంత కాలంగా రామకోటి రాస్తున్న శివకోటయ్యను కలువు. అతడికి చాలా ఆస్తి వుంది; వారసులంటూ ఎవరూ లేరు. నీ సంగతి చెపుతాను. ఆ తర్వాత యిక దయ్యంతో పొత్తు పెట్టుకోనని మాట యివ్వు." అన్నది.

భూతవైద్యుడు అయిష్టంగానే దేవతకు మాట యిచ్చి, మర్నాడు శివకోటయ్య దగ్గిరకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆయన దీక్షగా రామకోటి రాస్తూ, భూతవైద్యుణ్ణి కొంచెం ఆగమన్నాడు.

ఒక పావుగంట తరవాత ఆయన తల ఎత్తి, భూతవైద్యుడి కేసి వింతపడుతున్నట్టు చూస్తూ, "రాత్రి అమ్మవారు, నీ గురించి చెప్పింది. ఆవిడతో అనలేదు గాని—ఆవిణ్ణి కొలిచినన్నాళ్ళూ నాకు ఏదీ అచ్చిరాలేదు. ఇప్పుడు రామకోటి రాస్తుంటే ఎంతో మనశ్శాంతిగా వుంది. ఇది పూర్తయితే, యిక పుణ్యానికి కొద





వంటూ వుండదు. నా ఆస్తి, నాకు నచ్చిన వాళ్ళెవరికైనా యిచ్చిపోతాను,'' అన్నాడు.

భూతవైద్యుడు అవమానంతో కుంగిపోతూ ఇంటికి వెళుతూండగా, దారిలో జమీందారు నౌకరు వాణ్ణి కలుసుకుని, జమీందారు కూతురుకు దయ్యం పట్టిన సంగతి చెప్పాడు. వాడు సరాసరి జమీందారు ఇంటికి వెళ్ళగానే, అయన వాడికి మర్యాదలు చేసి, తన కూతురున్న గది చూపించాడు.

భూతవైద్యుడు గదిలోకి వెళ్ళి, తలుపులు మూయగానే, జమీందారు కూతురును పట్టిన దయ్యం చప్పట్లుచరిచి, కేరింతలు కొడుతూ, ''నా కిక్కడ చాలా బావుంది. రుచికరమైన భోజనం, మెత్తని పరుపులు. నేనిక యిక్కడే వుంటాను. నీ దారిన నువ్వుపో!'' అన్నది.

దయ్యం యిలా అనేసరికి భూతవైద్యుడికి నెత్తిన పిడుగుపడినట్టయింది. తను దయ్యాన్ని వదిలించకపోతే జమీందారు ఆగ్రహించి కొరత వేయిస్తాడు. దయ్యమేమో వదలనంటున్నది. ఈ చిక్కు నుంచి బయటపడడం ఎలాగో తెలియక, వాడు దిగులుతో ఇంటి దారిపట్టాడు.

ఆ రాత్రి భూతవైద్యుడికి ఎంతకూ నిద్రపట్టింది కాదు. చివరకు రాత్రి మూడో జాము జరుగుతూండగా, వాడికి చిన్న కునుకుపట్టింది. ఆ సమయంలో గ్రామదేవత వాడికి కలలో కనిపించి, ''ఎంతైనా దయ్యం, దయ్యమే! ఆ సంగతి మరిచి నువ్వు చిక్కుల్లో పడిపోయావు. ఇలా చెయ్యి!'' అని ఒక ఉపాయం చెప్పి అంతర్థానమైంది.

మర్నాడు వాడు ఒక పెద్ద గాజుజాడీతో జమీందారు ఇంటికి వెళ్ళాడు. దయ్యం గాజుజాడీని చూస్తూనే, ''ఇదేమి వింత! లోపల పట్టుకుచ్చుల ఉయ్యాల తమాషాగా ఊగుతున్నదేమిటి?'' అని అడిగింది.

భూతవైద్యుడు అమాయికంగా ముఖం పెట్టి, ''రాత్రి మా గురువు ఘోరాటకుడు వింధ్యారణ్యాల నుంచి తిరిగివచ్చాడు.

నా భక్తికీ, ఆతిథ్యానికీ మెచ్చి, ఈ జాడీ బహూకరించాడు. ఆ ఉయ్యాలలో కూర్చున్నవాళ్ళకు కోరిన రూపం వస్తుంది. అయినా, మనుషులు ఇంత చిన్న జాడీ లోకి వెళ్ళలేరు కదా? దీనివల్ల ఉప యోగం ఏమిటా అని ఆలోచిస్తున్నాను,'' అన్నాడు.

దయ్యం చప్పున భూతవైద్యుడి చేతులు పుచ్చుకుని, ''దీనివల్ల, నాకు చాలా ఉప యోగం వున్నది. నన్ను ఎంతోకాలంగా గొప్ప అందాలరాశి కావాలన్న తపనపట్టి పీడిస్తున్నది. నన్ను ఒకసారి గాజుజాడీ లోకిపోయి, కుచ్చుల ఉయ్యాలలో కూర్చోనియ్యి,'' అంటూ పొగరూపంలో జాడీలోకి వెళ్ళింది.

భూతవైద్యుడు చప్పున జాడీ మూత బిగించాడు. జరిగిన మోసం గ్రహించిన దయ్యం కీచుమంటూ, ''ఇది ద్రోహం! అన్యాయం!'' అంటూ గెంతసాగింది.

భూతవైద్యుడు పెద్దగా నవ్వి, ''జమీం దారు కూతురును వదలనని, నువ్వు నా ప్రాణం మీదికి తెచ్చావు. నువ్వు దయ్యానివి; నేను మనిషిని! మనిషిగా ఆ మాత్రం ప్రయోజనం ఆశించకపోతే, నేను తోటి మనుషుల మధ్య కూడా బతక లేను. ఇదంతా గ్రామదేవత చలవ!'' అని గాజు జాడీతోపాటు దయ్యాన్ని భూస్థాపితం చేశాడు.

జమీందారు చాలా సంతోషించి, భూత వైద్యుడికి ఐదెకరాల పొలం బహుమా నంగా యిచ్చి, కాలికి వెండికడియం తొడిగించి, గుర్రం మీద గ్రామంలో ఊరే గింపు చేయించాడు.

ఇంత జరిగాక గ్రామదేవతకు ఒక సత్యం తెలిసివచ్చింది. తాను మనుషు లందరూ మంచివాళ్ళనుకుంటున్నది. దయ్యం దృష్టిలో అందరూ చెడ్డవాళ్ళే. కాని, వాస్తవం ఏమంటే, మనుషుల్లో మంచీ—చెడూ రెండూ వుంటవి. ఇది గ్రహించాక గ్రామదేవత పనిగట్టుకుని భక్తుల కలల్లోకి రావడం, మాట్లాడడం మాని, మౌనం వహించింది.



# వ్యాపారరహస్యం!

భూషయ్యా, రాజయ్యా ఒకే గ్రామం వాళ్ళు. భూషయ్యకు ఏదో అవసరం వచ్చి, తన గుర్రపుబండిని వంద రూపాయిలకు రాజయ్యకు అమ్మాడు. కాని, బండిని మరీ కారుచవకగా అమ్మానన్న అనుమానం కలిగి, వారం రోజుల తరవాత దాన్ని రాజయ్య నుంచి రెండు వందలకు తిరిగి కొన్నాడు.

ఆ తరవాత రాజయ్యకు గుర్రపుబండితో అవసరంపడి, దాన్ని మూడు వందలకు భూషయ్య నుంచి కొన్నాడు.

ఈ విధంగా గుర్రపుబండి, వాళ్ళిద్దరి అవసరాలనుబట్టి చేతులు మారుతూ ఎనిమిది వందలవరకూ పోయింది. ఇంతలో పొరుగూరి వ్యాపారి ఒకడు దాన్ని భూషయ్య వద్ద నుంచి వెయ్యి రూపాయిలకు కొన్నాడు.

ఈ సంగతి తెలిసిన రాజయ్య మండిపడుతూ భూషయ్య దగ్గిరకు వచ్చి, "భూషయ్యా, నువ్వొట్టి మూర్ఖుడివి! నీకు వ్యాపార రహస్యం తెలియదు! మనిద్దరికీ అంతేసి లాభాలు సంపాయించి పెడుతున్న బండిని, అనవసరంగా పొరుగువాడికి అమ్మేశావు," అన్నాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్






"సూత మునీంద్రా! విష్ణువు తన మరొక రూపమైన కృష్ణుడుగా గోలోకంలో ఉంటాడని విన్నాము. ఆ కృష్ణుని గురించి వినగోరుతున్నాము!" అని మునులు కోరగా సూతుడు చెప్ప నారంభించాడు:

సత్యలోకానికి పైన గోలోకము ఉంది. అది అనేక నక్షత్ర సముదాయాలతో ఎల్లప్పుడూ వెన్నెలవంటి వెలుగుతో నిండి ఉంటుంది. విష్ణువు అతి గాఢమైన నీలపు రంగుతో నల్లనివాడుగా కృష్ణుడనే నామంతో, అక్కడ ప్రవహించే దివ్యనది విరజానది ఒడ్డున తులసివనంలో మురళిని పూరించి దివ్యగానం చేస్తూండగా మురళి నుండి వెలుపడే నాదము రాధగా రూపుదాల్చింది.

రాధ ప్రకృతి, కృష్ణుడు పురుషుడుగా విడని జంటగా గోలోకంలో విహరిస్తూ ఉంటారు. కృష్ణుడిని ఎల్లప్పుడూ సుదాముడు సేవిస్తూ ఉంటాడు.

రాధాదేవి శరీరం నుండి అనేకమంది గోపికలు పుట్టారు. విరజానది స్త్రీ రూపం ధరించి బృందాదేవిగా కృష్ణుణ్ణి ప్రేమతో ఆరాధిస్తూన్నది.

ఒకప్పుడు రాధాకృష్ణులు అనురాగ బద్ధులై ఏకాంతంలో ఉండగా అక్కడకు కృష్ణుడి కోసం విరజ వచ్చింది. రాధ కోపించి ఆమెను భూలోకంలో పుట్టమని శపించింది. అలాగ శపించడం అనుచిత మైన పని అని సుదాముడు రాధతో అన్నాడు.

**20. విష్ణులీల – కలియుగదైవం**



''నువ్వు కూడా భూమ్మీద రాక్షసుడవై పుట్టు!'' అని రాధ అతణ్ణి శపించింది.

విరజ రాకుమార్తెగా తులసి, బృంద అనే పేర్లు గలదిగా పుట్టింది.

ఒకప్పుడు దేవేంద్రుడు కైలాసం వెళ్లి, ద్వారానికి అడ్డంగా రుద్రభటుని రూపంతో ఉన్న శివుణ్ణి తెలుసుకోలేక వజ్రాయుధాన్ని ఝుళిపించాడు. శివుడు నిజ రూపంతో మూడో కంటిని తెరిచాడు.

ఇంద్రుడు రక్షించమని సాగిలపడ్డాడు. శివుడు నేత్రం నుండి వెలువడిన రోషాగ్నిని సముద్రంలోకి పంపాడు. అదే సమయాన రాధాదేవి శాపంవల్ల సుదాముడు గోలోకం నుండి అగ్నిహోత్రంలో పడి సముద్రంలో తెల్లనిశంఖాన్ని శిరస్సున ధరించిన బాలుడై పుట్టాడు.

సుదాముడు కృష్ణుడు యిద్దరూ ఒకటే! కృష్ణుడు తన పార్శ్వచరుడైన సుదామునిపైగల అభిమానంతో, ఆ బాలకుడికి అజేయమైనకృష్ణకవచాన్ని ప్రసాదించాడు.

సముద్రం ఒడ్డున పుత్రుని కోసం తపస్సు చేస్తున్న దంభుడు అనే రాక్షసరాజు ఆ పిల్లవాణ్ణి జలప్రసాదితుడైన కుమారుడిగా తీసుకున్నాడు. అతడు జలంధరుడు, శంఖచూడుడు అని పిలువబడ్డాడు.

తులసి విష్ణువును తన భర్తగా తలంచుతూ, విష్ణువును ఆరాధిస్తూ తపస్సు చేస్తూండగా జలంధరుడు ఆమెను చూశాడు.

జలంధరుడు తులసి, తండ్రి ధర్మధ్వజుడిని, తులసిని తనకిచ్చి వివాహం చేయమని కోరాడు.

జలంధరుడితో తులసి వివాహం జరిగింది. తులసి తన భర్తనే తన దైవంగా ఎంచి పతివ్రతగా మెసులుతూ ఉన్నది.

జలంధరుడు రాక్షస బలాల్ని కూడగట్టుకొని ముల్లోకాలు జయించాడు.

తులసీ దేవి పాతివ్రత్య మహిమవల్ల అతనికి ఎక్కడా ఎటువంటిహానీ జరగలేదు.

తులసి సౌందర్యానికి జలంధరుడామెను వివాహమాడాడే కాని, అతని

రాక్షసతత్వానికి, ఆమె సాత్వికతత్వం పెళ్ళిలోనే నచ్చలేదు. పెళ్ళిపీటల మీది నుంచి లేచింది మొదలు అతడు ఆమెను చూడటమే మానేశాడు.

తులసి సదా భర్తనే తలంచుతూ, పీఠం పైనున్న అతని అడుగుజాడలనే ఆరాధిస్తూన్నది.

జలంధరుడు రాక్షస సామ్రాట్టయి కృష్ణకవచ ప్రభావంతో ముల్లోకాలను జయించాడు.

కలహభోజనుడైన నారదుడు పార్వతి అందం గురించి వర్ణించగా, జలంధరుడు కైలాసం మీదకు దాడిచేసి, మంచిగా పార్వతిని యిస్తే యిచ్చావు. లేదా యుద్ధానికి రా! అని శివుడిపై విజృంభించాడు. శివుడు విసిరిన త్రిశూలం జలంధరుడి రొమ్ముతాకి ఖంగుమంటూ కిందపడింది.

పార్వతి భయంతో పారిపోయి రాధాదేవిని ప్రార్థించింది.

రాధ పార్వతితో, "జలంధరుడు శివుని నేత్రాగ్ని నుంచే పుట్టాడు. శివుడి వల్లనే అతని సంహారం జరగాలి. అయితే అతనికిగల కృష్ణకవచం వల్ల ఏ ఆయుధమూ అతని కెటువంటి హానీ చేయలేదు. తులసీదేవి పాతివ్రత్య మహిమవల్ల అతనికి ప్రాణభయం లేదు! విష్ణుమాయకు అతీతమైనది ఏదీ లేదు. నీవు



విష్ణువును ప్రార్థించు, ఏం చేసినా అతడే చేస్తాడు!" అని చెప్పింది.

పార్వతి ప్రార్థన విని విష్ణువు వృద్ధ బ్రాహ్మణరూపంతో వెళ్ళి, హిమాచల శీతలానికి గజగజ వొణికిపోతూ జలంధరుణ్ణి అనేకవిధాలుగా పొగిడి, "వీరాధివీరుడివైన నీకు వేరొక కవచమెందుకు? చలిజ్వరంతో చస్తున్న నా లాంటివాడికిస్తివా బతికిపోతాను!" అన్నాడు.

జలంధరుడు దర్పంతో, "ఔను! కృష్ణకవచం నాకేల? తీసుకో!" అని బ్రాహ్మడికి దానం యిచ్చేశాడు.

తరవాత విష్ణువు జలంధరుడి రూపంతో తులసీదేవి మందిరంలోకి



వెళ్ళాడు. అక్కడ కైలాసంలో శివుడికీ జలంధరుడికీ యుద్ధం జరుగుతున్నది.

ఒకానొకప్పుడు గండకి అనే దేవవేశ్య భూలోకానికి చేరి విష్ణువును గూర్చి గొప్ప తపస్సు చేసింది. విష్ణువు ప్రీతిజెంది ఏం కావాలో కోరుకోమన్నాడు. "దేవా! నిన్ను నాలో రత్ననిధుల్ని దాచుకొన్నట్లుగా గుప్తపరుచుకోవాలి" అన్నది గండకి.

విష్ణువు, "నువ్వు, గండకీనదిగా ప్రవహించు. నీ జలాల్లో, నేను సాలగ్రామాన్నయి ఉంటాను!" అని చెప్పాడు. గండకి నదిగా మారింది.

తులసీదేవి విష్ణు మాయాప్రభావానికి లోనై, తన పెనిమిటి యిన్నాళ్ళకు వచ్చినందుకు ఆనందంతో భ్రమలోపడి పతి రూపంలో ఉన్న విష్ణువు పాదాలకు ప్రణమిల్లింది. అదే సమయంలో శివుడు జలంధరుడి కంఠాన్ని త్రిశూలంతో ఛేదించాడు. ఆ శిరస్సు ఎగిరివచ్చి తులసీదేవి చేతులకు తగుల్తూ పడింది. విష్ణువు నిజరూపం పొందాడు.

తులసి తృళ్ళిపడి భర్తశిరస్సును చూసి, భ్రమనుండి విముక్తురాలై, "ఓ, విష్ణూ! నన్ను మోసగించినందుకు నువ్వు రాయిగా మారు!" అన్నది.

విష్ణువు చిరునవ్వు చిందిస్తూ, "తులసీసతీ! సంతోషంతో నీ శాపాన్ని శిరసావహిస్తున్నాను. నీ భర్త జలంధరుడు ఎవరో కాదు, సుదాముడే! నేనే కృష్ణ, సుదాముల రూపాలతో గోలోకంలో ఉంటాను.

వివాహానికి పూర్వం నువ్వు నన్ను పతిగా కోరుతూ ఆరాధించినదానివే! వివాహం జరిగాక ధర్మాన్ననుసరించి సతీలోకానికి ఆదర్శప్రాయంగా పరమసాధ్వీగా, సతీతులసిగా వర్తించావు. నీవు పవిత్రతకు చిహ్నంగా తులసిచెట్టుగా భూమ్మీద మొలుస్తావు. తులసి నాకు అత్యంత ప్రీతిపాత్రంగా ఉంటుంది. తులసి సన్నిధిలో నేనెప్పుడూ శిలారూపంతో ఉంటాను!" అని చెప్పాడు.

విష్ణువు గండకీ నదిలో సాలగ్రామ శిలల రూపంతో అవతరించాడు. తులసి సహగమనం చేశాక తులసి చెట్టుగా మొలిచింది.

గండకీనదిలో అపురూపంగా దొరికే సాలగ్రామ శిలలను తులసిచెట్టు మొదట ఉంచి అర్చించడం ఏర్పడింది. తులసి దళాలు సాలగ్రామ శిలపై రాలుతూ ఉంటే విష్ణువు పవిత్రమైన తులసి మాలలు ధరిస్తూంటాడు.

ఒకప్పుడు మహర్షులు త్రిమూర్తులలో ఎవరు గొప్ప? అనేది తేల్చుకురమ్మని భృగుమహర్షిని పంపారు.



భృగువు సత్యలోకం వెళ్ళాడు. అక్కడ సరస్వతీదేవి వీణావాద మాధురిలో మునిగితేల్తూన్న బ్రహ్మ అతణ్ణి కనీసం చూడనైనా లేదు.

కైలాసం వెళ్తే పార్వతితో నృత్యం చేస్తున్న పరమశివుడు భృగుమహర్షిని చీదరించుకున్నాడు.

భృగుమహర్షికి రెండు పరాభవాలతో ఒళ్ళు మండిపోయింది. అతని పాదానికి కన్ను ఉన్నది. అంచేత అతనికి అహంకారం మెండు.

భృగువు కోపంతో వైకుంఠానికి చేరాడు. లక్ష్మీసమేతంగా శేషతల్పశాయి అయిన విష్ణువును చూసి, రివ్వునవెళ్ళి భృగుమహర్షి విష్ణు వక్షస్థలాన్ని పాదంతో తన్నాడు. విష్ణుమూర్తి దిగ్గునలేచి మహర్షికి ప్రణమిల్లి, అతని పాదాన్ని తలపై పెట్టుకొంటూ, "మహర్షిసత్తమా, నీ మృదు పాదారవిందము నా కఠిన వక్షాన్ని తాకినందున ఎంత కమిలిపోయిందో గదా!" అంటూ పాదాన్ని ఒత్తుతున్నట్టే ఒత్తుతూ, పాదం అడుగున ఉన్న కంటిని నొక్కి చిదిమివేశాడు. పాదనేత్రం చిదగడంతో భృగుమహర్షి అహంకారం కూడా చిదిగి పటాపంచలైంది.

భృగువు విష్ణువును స్తుతించి, వెళ్ళి విష్ణువు గొప్పతనాన్ని మునులకు వివరించి చెప్పాడు.



కుమారుడి పెళ్ళి చేయాలని ఉండే కోరిక ఎంత గొప్పదో నీకు తెలియంది కాదు, నాకది తీరిందికాదు!'' అనీ వాపోయింది. అప్పుడు కృష్ణుడు, ''అమ్మా! వచ్చే జన్మలో నీ ముచ్చట తీర్చుకుందువు గాని!'' అని చెప్పాడు.

వకుళాదేవి శ్రీనివాసుణ్ణి తన కుమారుడిగా యెంచి పరమానందం పొందింది. వకుళ కుమారిడిగా శ్రీనివాసుడు ఆశ్రమంలో ఆనందంగా పెరుగుతూ వనవిహారం చేస్తూండగా, ఆకాశరాజు కుమార్తె పద్మావతి చెలికత్తెలతో వనవిహారానికి అదే వనానికి వచ్చింది

అంతలో ఒక మదించిన ఏనుగు ఘీంకారాలు చేస్తూ వనం దద్దరిల్లేలాగా పరుగున వచ్చింది. చెలికత్తెలు చెల్లా చెదరైపోయారు. తత్తరపాటుతో పద్మావతి శ్రీనివాసుడు వస్తున్న దగ్గరలో పడిపోయింది.

శ్రీనివాసుడు ఏనుగుకు అడ్డు నిలిచాడు. మదకరీంద్రం తక్కున ఆగిపోయి తొండమెత్తి మొక్కింది. పద్మావతి చేతిని శ్రీనివాసుడు తన చేత్తోపట్టి లేవనెత్తాడు.

పద్మావతి, శ్రీనివాసులకు ఒకరిపైన ఒకరికి అనురాగం ఏర్పడింది. పద్మావతి పూర్వజన్మలో విష్ణువును పతిగా పొందాలని తపస్సు చేస్తూ, రావణుడామెను

విష్ణువు వక్షస్థలం మీద తాను అనుకొని ఉండగా భృగుమహర్షి తన్నడం లక్ష్మీదేవికి గొప్ప పరాభవంగా తోచింది. ఒక మునిమ్రుచ్చు పాదస్పర్శతో అపవిత్రం అయినట్లుగా ఎంచి వైకుంఠంలో ఉండకుండా భూలోకానికి చేరి తపస్వినిగా తపోదీక్షలో మునిగింది.

విష్ణువు లక్ష్మికోసం మానవయువకుని రూపంతో భూమిని చేరి అరణ్యాలు వెతుకుతూ శ్రీనివాసుడు అనే పేరుతో వకుళాదేవి ఆశ్రమాన్ని చేరాడు. వకుళామాత కృష్ణావతారంలో యశోద.

చిరకాలానికి వ్రేపల్లెకు కృష్ణుడు వచ్చినప్పుడు యశోద కృష్ణుడితో, ''తల్లికి

తాకిన కారణంగా యోగాగ్నిలో కాలి పోయిన వేదవతి.

వకుళ అరుంధతి, సప్తర్షులు వెంట రాగా తన కుమారుడికి పిల్లను అడగ డానికి ఆకాశరాజు సదనానికి వెళ్ళింది.

శ్రీనివాసుడు ఎరుకత రూపంతో వెళ్ళి కోరినవాడే పెళ్ళాడతాడని పద్మావతికి సోది చెప్పాడు.

పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణం వైభవంగా కుబేరుడు పంపిన ధన కనక రత్నరాసులతో దివ్యంగా జరిగింది. శ్రీనివాసుడు పద్మావతితో బయలుదేరాడు.

నారదుడు తపస్సులో ఉన్న లక్ష్మికి శుభవార్త విన్నవించాడు. లక్ష్మి ఆవేశంతో బయలుదేరింది.

అల్లంతదూరంలో వస్తున్న లక్ష్మని చూసి శ్రీనివాసుడు పద్మావతిని అక్కడ ఉంచి, చరచరా ఏడు శిఖరాలు గల శేషాద్రిన్ని అధిగమించి చివరి తిరు శిఖరాగ్రంపై నిలబడి లక్ష్మి రాకకు ఎదురు చూస్తున్నాడు.

లక్ష్మి రాగానే శ్రీనివాసుడు ఆమె వేడి చూపులకు బదులుగా మందహాసం చిందిస్తూ, నల్లని రాయిగా మారి పోయాడు. ఆ విగ్రహం నిండుగా తులసి మాలలు దివ్యంగా శోభించాయి.

ఆ విగ్రహంలో విష్ణు, శివ, శక్తి అంశలు మూర్తీభవించాయి, యింకా ఎన్నో దివ్యరూపాలు గోచరించాయి.

ఎవరు ఏ విధంగా తలంచినా అలాగే కనిపిస్తూ శ్రీనివాసుడు, వేంకటరమణుడు, వేంకటేశ్వరుడుగా పిలువబడుతూ సప్త గిరి వేల్పుగా విష్ణువు అక్కడ వెలిశాడు.

పద్మావతి శేషాద్రి చేరువనే అలమేలు మంగమ్మగా వెలిసింది. లక్ష్మి తపమాచరించినచోట మహాలక్ష్మిగా నిలిచింది. ఆ చోటనే కోలాహపురం నిర్మితమై లక్ష్మి నిలయమైంది.

విష్ణువు శేషాద్రి శిఖరాన 'కలియుగ దైవం'గా వైభవోపేతుడై విలసిల్లాడు. విష్ణు లీలను విన్న మునులు పరమానందం పొందారు.





# వర్తకుడి పరీక్ష

ధనంజయుడనే వర్తకుడికి, అవసరం కలిగినప్పుడు పట్టణంపోయి సరుకులూ అవీ కొని తెచ్చేందుకు సాయంగా, ఒక మనిషి కావలసి వచ్చాడు. ఈ సంగతి మిత్రుడైన ఒక తోటివర్తకుడికి చెప్పగా, ఆయన గిరినాధుడు, అమరనాధుడు అనే యిద్దరు యువకుల్ని పంపాడు.

ఇద్దరూ ధనంజయుణ్ణి కలుసుకుని తాము వచ్చిన పని చెప్పారు. ధనంజయుడు వాళ్ళను నడవాలో కూర్చోమని చెప్పి, లోపలికి వెళ్ళి, గంట తరవాత హడావిడిగా తిరిగివచ్చి, "మీరేం అనుకోకండి! చాలా అవసరం అయిన పని మీద నేను వీరేంద్రపురం వెళ్తున్నాను. తిరిగి వచ్చేసరికి, రాత్రి బాగా పొద్దుపోవచ్చు. కనక, మీ యిద్దరూ రేపు ఉదయం రండి. మీలో ఒకర్ని తప్పక పనిలోకి తీసుకుంటాను," అన్నాడు.

ధనంజయుడు తన వెంట తీసుకుపోతున్న డబ్బు మూటను దుస్తుల్లో దాస్తున్న పద్ధతి చూసి గిరినాధుడు, "అయ్యా, వీరేంద్రపురంలో, మనం యిలా కళ్ళుమూసి తెరిచేలోపల మన దగ్గిరున్న డబ్బును దొంగిలించే నేర్పరులైన దొంగలున్నారు. ఇది యింతవరకూ నాకు నాలుగుసార్లు అనుభవం అయ్యింది. మీరు చాలా జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు.

"అలాగా! అక్కడి సత్రాల్లో భోజన సౌకర్యాల మాటేమిటి?" అని అడిగాడు ధనంజయుడు.

"ఆ సత్రాల్లో భోజనం ఏమీ బావుండదు. ఆ భోజనం పడక, నేను వెళ్ళిన ప్రతిసారీ అనారోగ్యానికి గురయ్యాను," అన్నాడు గిరినాధుడు.

ధనంజయుడు, అమరనాధుడికేసి తిరిగి "నువ్వూ, వీరేంద్రపురం వెళ్ళి

రాంబాబు

వుంటావు. నీ అనుభవం ఏమిటి?'' అని అడిగాడు.

అమరనాధుడు, గిరినాధుడు చెప్పిన దంతా నిజం అని, ''అక్కడ నేనూ ఒక సారి డబ్బు పోగొట్టుకున్నాను. ఆ తరవాత తగుజాగ్రత్తలో వుండడం వల్ల, మరే నాడూ అలా జరగలేదు. నాకూ సత్రం భోజనం పడక ఒకసారి జబ్బు చేసింది. అది గుర్తుంచుకుని, అక్కడికి వెళ్ళేట ప్పుడు తగిన మందులు. తీసుకు వెళ్ళే వాడిని. మీరూ వాటిని వెంట వుంచుకో వడం మంచిది,'' అంటూ, ఆ మందుల పేర్లు ధనంజయుడికి చెప్పాడు.

ధనంజయుడుఅమరనాధుడితో."నువ్వు రేపటినుంచిపనిలోకి రావచ్చు," అన్నాడు.

గిరినాధుడు కోపంగా, ''అయ్యా, యిది న్యాయం అనిపించుకోదు. మీరు, మా యిద్దర్నీ రేపు వచ్చి కలుసుకోమన్నారు. అయినా, త్వరపడి నిర్ణయం చేశారు. ఇది నా తెలివి తేటల్ని శంకించడం అవుతుంది,'' అన్నాడు.

అందుకు ధనంజయుడు చిన్నగా నవ్వి. ''ఇంత త్వరలో మీ ఇద్దరిలో ఒకర్ని ఎన్నిక చేశానంటే, అందుకు కారణం నువ్వు గ్రహించలేదన్నమాట! అయితే, నేచెబుతా విను: వీరేంద్రపురంలో ఒక సారి కాదు, నాలుగుసార్లు, నీ డబ్బు దొంగిలించబడినట్టు చెప్పావు. దీన్నిబట్టి, నీవేపాటి జాగ్రత్తగలవాడివో తెలుస్తూనే వున్నది. ఒకసారి అక్కడి సత్రాల్లో భోజనం తిని జబ్బు చేసినప్పుడు, వైద్యుణ్ణి సంప్రతించి తగిన మందులు వెంట తీసుకువెళ్ళవలసింది. కాని, నువ్వలా చేయక, వీరేంద్రపురం వెళ్ళిన ప్రతిసారీ అనారోగ్యానికి గురయ్యావు. దీన్నిబట్టి, నీ తెలివితేటలేపాటివో అంచనా కట్ట వచ్చు!'' అన్నాడు.

ఇది విన్నాక గిరినాధుడికి, తనకన్న అమరనాధుడు తెలివిగలవాడనీ, ముందు చూపు వున్నవాడనీ అర్థమయింది. దానితో అతడు శాంతపడి, ధనంజయుడికి నమస్కరించి, వెళ్ళిపోయాడు.





# దివ్యౌషధం

ఒక దేశంలో ఒక రాజూ, రాణీ ఉండేవారు. వారిద్దరూ మూఢులే. రాణి తొలిసారిగా గర్భవతి అయి ఒక ఆడ శిశువును కన్నది. ఆ శిశువు కూనారిగా ఉండటమే గాక, దానికి తలపై వెంట్రుకలు లేవు, నోట్లో పళ్ళు లేవు.

''ఛీ, ఛీ, ఇదేం పిల్ల!'' అన్నది రాణి అసహ్యించుకుంటూ.

''మనకు నాసిరకం పిల్ల పుట్టింది. ఈ సంగతి తెలిస్తే, నలుగురిలో ఎంత అవమానం!'' అన్నాడు రాజు చెప్పలేనంత దిగులుగా.

మంత్రులు రాజుతోనూ, రాణీతోనూ, ''తమరేమీ విచారించకండి. పుట్టినప్పుడు పిల్లలంతా ఇలాగే ఉంటారు,'' అని చెప్పి చూశారు.

''మా కళ్ళ నీళ్ళు తుడవటానికి బొల్లి కబుర్లు చెప్పవద్దు. దేశంలో ఉన్న వైద్యులందరినీ తక్షణం యిక్కడికి పిలిపించండి,'' అన్నాడు రాజు.

దేశంలోని ఘన వైద్యులందరూ రాజు దగ్గరికి వచ్చారు.

''మాకు కుమార్తె కలిగిన మాట నిజమే. కాని అది మరీ చిన్నదిగా ఉన్నది. దాని తలపై వెంట్రుకలు లేవు. నోట్లో పళ్ళు లేవు. మీరంతా దీనికి తగిన చికిత్స ఆలోచించి, మందులిచ్చి, ఈ పిల్ల వెంటనే పెద్దదయేటట్టూ, దీని తలపై వెంట్రుకలుండేటట్టూ నోట్లో పళ్ళుండేటట్టూ చెయ్యండి,'' అని రాజు వారితో అన్నాడు.

''మహారాజా, ఇది సాధ్యమయే పని కాదు,'' అన్నారు వైద్యులు.

''చక్రవర్తిని నేను అజ్ఞాపిస్తున్నాను. ఇంకా సాధ్యం కాకపోవటం ఎటువంటిది? నేను చెప్పినట్టు చెయ్యటానికి మీరు



అప్పుడొక వృద్ధ వైద్యుడు, "మహా రాజా, తొందరపడకండి. మీ ఆజ్ఞను శిరసావహించటానికి మేం సిద్ధంగానే ఉన్నాం. ఇందుకుగాను ఒక దివ్యౌషధం ఉన్నది. అది గనక ఇచ్చినట్టయితే రాజకుమార్తె పెరిగి పెద్దదవుతుంది. ఆమెకు తలనిండా వెంట్రుకలూ, నోటి నిండా పళ్ళూ ఏర్పడతాయి," అన్నాడు.

"మంచిది. ఆ దివ్యౌషధం ఎక్కడ ఉన్నది?" అని రాజు అడిగాడు.

"అది సిద్ధంగా లేదు. దానిని తయారు చేసుకోవాలి. కొంత కాలం పడుతుంది," అన్నాడు వృద్ధ వైద్యుడు.

"కొంత కాలం పట్టటం దేనికి? నేను రాజును, రాజాధిరాజును, మహా చక్రవర్తిని. ఇప్పుడే ఆ దివ్యౌషధం నాకు కావాలి. అది వెంటనే ఎందుకు తయారు కాదూ?" అన్నాడు రాజు.

"తమ రన్నది నిజమే, కాని ఆ దివ్యౌషధం తయారు చెయ్యటానికి నాలుగు వందల అరవై అయిదు రకాల మూలికలు కావాలి, మూడు వందల పన్నెండు రకాల ధాతువులు తేవాలి," అన్నాడు వైద్యుడు.

రాజు గర్వంతో, "తప్పకుండా అన్ని దినుసులూ తెచ్చి, వెంటనే దివ్యౌషధం తయారు చెయ్యండి," అన్నాడు.

సమ్మతించకపోయారో మిమ్మల్నందరినీ బెత్తాలతో వీపులు చిట్లగొట్టిస్తాను. అయిదు నిమిషాలు వ్యవధి ఇస్తున్నాను. ఆలోచించుకోండి," అంటూ రాజు అవతలికి వెళ్ళిపోయాడు.

ఆయన అయిదు నిమిషాల అనంతరం తిరిగి వచ్చి, దీనంగా తలలు వంచుకుని వున్న వైద్యులతో, "ఏం నిర్ణయించారు? నా కూతురికి వైద్యం చేస్తారా? దెబ్బలు తింటారా?" అని అడిగాడు.

వైద్యు లెవరూ మాట్లాడలేదు.

రాజు తన భటులను పిలిచి, "బెత్తాలతో వీరందర్నీ చావగొట్టండి!" అని ఆజ్ఞాపించాడు.

"మహారాజా, అది అంత శీఘ్రం అయే పనికాదు. రెండేళ్ళకొకసారి పూసే మూలిక ఉన్నది. అది నాలుగో విడత పూస్తూండగా ఏరుకు రావాలి. అలాగే, ఒక ధాతువు మంచుకొండల మీద తప్ప మరెక్కడా దొరకదు. ఆ కొండల మీద మంచు ఆరేళ్ళ కొకసారి మాత్రమే కరుగుతుంది. అలా రెండుసార్లు కరిగిన తరవాతనే ఆ ధాతువును తవ్వి తీసుకు రావాలి," అన్నాడు వైద్యుడు.

"సరే, సరే, ఇంతకూ ఆ దివ్యౌషధం ఒక వారంలో తయారవుతుందా?" అని రాజు అడిగాడు.

"ఇంకా ఎక్కువ కాలం పడుతుంది, మహారాజా. తమరు ఒక పని చేయ గూడదా? మీ అమ్మాయిని పన్నెండేళ్ళ పాటు మా పెంపకంలో ఉంచండి. ఆమెకు చెయ్యవలసిన చికిత్స సక్రమంగా చేస్తాం," అన్నాడు వృద్ధవైద్యుడు.

రాజు రాణికేసి తిరిగి, "ఏమంటావు, దేవీ? మన అమ్మాయిని పన్నెండేళ్ళ పాటు వీరి కిచ్చి చికిత్స చేయింతామా? లేక వీరందరినీ బెత్తాలతో చావ గొట్టించనా?" అని అడిగాడు.

రాణి కొంచెం ఆలోచించి, "వాళ్ళకు పన్నెండేళ్ళు వ్యవధి ఇచ్చి చూద్దాం. అప్పటికీ అమ్మాయికి చికిత్స చెయ్యలేక పోతే ఏకంగా అందరి తలలూ తీసెయ్య వచ్చు," అన్నది.

రాజు సరేనన్నాడు. వైద్యులు రాజ కుమార్తెను తమ వెంట తీసుకుపోయి, ఆమెను శ్రద్ధగా పెంచటమేగాక, చదువు చెప్పి, ప్రపంచజ్ఞానం కలిగించారు. ఆమె వారివద్ద పన్నెండేళ్ళు పెరిగి తలిదండ్రుల వద్దకు తిరిగి వచ్చింది.

ఆమె తల మీద నల్లని తలకట్టూ, నోట్లో తెల్లని పలువరుసా చూసి, రాజూ రాణీ ఎంతో సంతోషించి వైద్యులకు గొప్ప బహుమానాలిచ్చారు.

తల్లిదండ్రుల అనంతరం రాజకుమార్తె రాణీ అయి ప్రజలను వివేకంతో పాలించింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Mrs. Manjula



H. N. Kelora

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రతి రోజూ ఓ ఆట

రెండవ ఫోటో : ప్రేకకు డొకడే ఈ పూట

పంపినవారు : శ్రీమతి టి. రంగనాయకమ్మ, ఖమ్మం—507 001, (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/—నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా ? సమాధానాలు :

1. గారావతి నదిపై వున్న జోగ్ జలపాతం. 2. హరిద్వారం. 3. సబర్మతి. 4. మధ్యప్రదేశ్. 5. కలకత్తాలో.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, . Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.




జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, వల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

**ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.**

చదవండి! చదివించండి!!

తొమ్మిదేళ్ళుగా మహిళా పాఠకులను విశేషంగా ఆకర్షిస్తూ వినూత్న శీర్షికలతో వినోదంతోపాటు విజ్ఞానాన్ని మేళవించి, అందజేస్తూ పదవ ఏట అడుగు పెడుతున్న

నెలతల నెచ్చెలి

# వనిత






## తాజా వార్త



ఏయ్ నేస్తాలూ,
నేనిక్కడ ఎంతో మందితో
రహస్యపు ఆలోచనలు
చేస్తున్నాను. మీకోసం నేను
ఇస్తున్నవి ఏమిటో తెలుసా:
క్లబ్ సభ్యులకు పెద్దగా
ధరల తగ్గింపులు!

### ఆ పెద్ద డిస్కౌంట్లు ఏవేవి?



- హాట్‌షాట్ 110 ఎస్ కెమెరా మీద రూ. 50/- తగ్గింపు.

HOT SHOT 110 S



- 'కబ్' పత్రిక చందాలో రూ. 11/- తగ్గింపు.



- కేమ్లిన్ డ్రాయింగ్ ఇన్‌స్ట్రుమెంట్స్ బాక్స్, వాటర్ కలర్స్, ఆయిల్ పేస్టల్స్, పోస్టర్ కలర్స్ మీద 10% తగ్గింపు.



- ఇండియా బుక్ డిస్ట్రిబ్యూటర్స్ ప్రచురించిన అన్ని పుస్తకాల మీదా 10% తగ్గింపు.

NELCO



- ఏ మోడల్ నెల్కో రేడియో మీదైనా రూ. 20/- తగ్గింపు, నెల్కో కేసెట్ రికార్డర్ మీద రూ. 30/- తగ్గింపు లేదా నెల్కో టూ-ఇన్-వన్ మీద రూ. 50/- తగ్గింపు.

### క్లబ్‌లో సభ్యులవడానికి ఏం చెయ్యాలి?

మికీ మౌస్ క్లబ్ ఆల్బమ్‌లు 3 సేకరించండి. మూడు వేర్వేరు సభ్యత్వపు ఫారమ్‌లు (ఒక్కొక్క ఆల్బమ్‌లో ఒక్కొక్కటి ఉంటుంది) పూర్తి చేసి, మీకు దగ్గర్లోని గోల్డ్ స్పాట్ మార్పిడి కేంద్రంలో ఇవ్వండి.

మీకు ఒక ప్రత్యేకమైన మికీ మౌస్ క్లబ్ బ్యాడ్జ్, గుర్తింపు కార్డు, ప్రత్యేకమైన డిస్కౌంటు కూపన్ల (ధరల్ని తగ్గించే కూపన్ల) పుస్తకం ఇస్తారు!



మరిన్ని ప్రత్యేక
అవకాశాలివ్వడం గురించి
ఆలోచించేందుకు నా రహస్య
స్థావరానికి పోతున్నా.
(గమనించాలి, అవకాశాలు
క్లబ్ సభ్యులకే సుమా!)
వచ్చే ఆల్బమ్‌లో మీకు చెప్తా!
ఉంటా మరి!






Fun means Goldspotting

GOLD SPOT